# అందరి ఆనందం

(సాంఘిక నాటకము)

రచన

డాక్టర్ కొర్రపాటి గంగాధరరావు

బాపట్ల (గుంటూరు జిల్లా)

పబ్లిషర్సు

కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో

రాజమండ్రి

## హెచ్చరిక

ఈ నాటకంయొక్క సర్వహక్కులూ నాకు చెంది యున్నవి. గాన దీనిని ఎవరు ఏవిధంగా ఉపయోగించు కున్నా ముందుగా లిఖితపూర్వకమైన అనుమతి పొంద వలెను. అట్లు పొందకుండా ఉపయోగించుకొన్నవారిపై చర్య తీసుకొనబడును.

ఇట్లు

డాక్టర్ కొర్రపాటి గంగాధరరావు

బాపట్ల (గుంటూరు జిల్లా)

# అందరి ఆనందం

పంచవర్ష ప్రణాళిక ప్రచారానికి కేంద్రప్రభుత్వం నాటకాల కోసం రచయితలను కోరింది. రచయిత లెందరో నాటకాలు పంపారు. నేనూ ఈ నాటకాన్ని పంపాను. కేంద్రప్రభుత్వం ఏనాటకాన్ని యింతవరకూ ఎన్నుకోలేదు. కాని ఈ నాటకం వ్రాసి ఉన్నదని తెలిసిన మిత్రు లెందరో ప్రతులకోసం వ్రాస్తు న్నారు. అందువల్ల ఈ నాటకాన్ని ప్రచురిస్తున్నాం. N. E. S. Community Blocks మొదలైన వాటిల్లోనూ నిజానికి ప్రతి గ్రామంలోనూ తిరిగి తిరిగి ప్రదర్శించవల్సిన నాటకం యిది. మన దేశంలో ముఖ్యంగా గ్రామాల్లో సంఘీభావం, దేశాభిమానం త్యాగాల ప్రచారం జరగవల్సి వుంది. ఈ నాటకం అందుకు బాగా పనికివస్తుందని ఆశిస్తున్నాను.

నాటకం చివర ఊరు వదలి వెళ్ళిపోవడం కొంత నిరుత్సా హాన్ని కల్గిస్తోందని కొందరు ప్రేక్షకులు విమర్శించారు. అది నిజమే. కాని నాటకపు ఉద్దేశ్యం ప్రజ లందరూ సంఘీభావంతో కృతకృత్యు లవటమే కాదు. దేశంకోసం, అంటే దేశ ప్రజ లందరి ఆనందంకోసం, ప్రతి ఒక్కడూ త్యాగం చేయటానికి సిద్ధంగా ఉండాలనేది నాటకాశయం. ఆ త్యాగశీలత పెంపొందిన నాడు ఏ ప్రచారాల అవసరం లేకుండానే దేశం అభివృద్ధి పొందు తుంది. కనక చివరి సన్నివేశం మార్చకుండానే ప్రచురిస్తున్నాను. ఈ నాటకం విషాదాంతమా, సుఖాంతమా, అనేది ప్రశ్న కాదు. ఇవ్వదగిన సందేశాన్ని నాటకం అందిచ్చిందా అనేదే ప్రశ్న.

ప్రథమపర్యాయం దీన్ని కళావనీ బాపట్లవారు ప్రదర్శించారు. బాపట్లలో గల విద్యావంతులూ, విద్యార్థులూ దీన్ని వీక్షించారు. కొందరు విద్యార్థులు "సుబ్బులూ సౌభాగ్యా" ప్రేమ శలాపాల సందర్భంలో చక్కలిగింతల ననుభవించి ఉత్సాహం పట్టలేకపోయినా నాటకం విజయవంతంగా ప్రదర్శింపబడింది.

దీనిలో ప్రచార భావా లన్నీ విద్యావంతు లందరికీ తెలిసినవే; తెలిసినవే తిరిగి తిరిగి చెపుతుంటే రక్తి చెడుతుంది. సాధారణంగా ప్రచార నాటకాలు ఇందువల్లనే దెబ్బతింటాయి. అయినా ప్రేక్షకు లందరూ విద్యావంతు లైనప్పటికీ నాటకం రక్తిగా నడిచింది. "ఈ భాగం తీసివేద్దామనే ఉద్దేశ్యం గూడా ఎక్కడా కలగలేదు. చివరకు ఎంతో భయపడిన ఈశ్వరం ఆఖరి ప్రసంగం కూడా విసుగుపుట్టించలేదు. ప్రదర్శనానంతరం కొద్ది మార్పులతో దీన్ని ప్రచురిస్తున్నాం.

పంచవర్ష ప్రణాళికలు మారిపోతాయి. కొత్త స్కీములు కలుస్తాయి. పాత స్కీము లయిపోతాయి. అంతే కాక స్థానికంగా ఉన్న అనేక చిన్నచిన్న స్కీములకు అసలు ప్రచారమే లోపిస్తుంది. కనక నాటకం సంవత్సరాలతో బాటు మారిపోతూ ఉండాలి.

ఈ విషయాన్ని గుర్తుంచుకొని ప్రచార భాగాలు మారవల్సినవి తేలిగ్గా ఎవరైనా మార్చుకునే సావకాశం వుండేటట్లుగా, స్థానికంగా అమలులో ఉన్న చిన్నచిన్న ప్రణాళికాంశాలూ ప్రదర్శకులే కలుపుకునే సావకాశం ఉండేటట్లు వ్రాశాను. ప్రదర్శకు లిది గమనించి వలయు మార్పులు చేసుకోగలరని ఆశిస్తున్నాను.

గంగాధరరావు.

## పాత్రలు

సుబ్బులు
ఈశ్వరం
వీరయ్య
అమరయ్య
రావు
రావుగారి కొడుకు
సర్వే ఇంజనియరు
కేశవయ్య
రామయ్య
డాక్టరు
సౌభాగ్య
మరికొందరు ప్రజలు

# అందరి ఆనందం

## ఒకటవ రంగము

[ఒక గ్రామంలో పుస్తకభాండాగారపు ముందువసారా, వసారాలో రెండు బెంచీలమీద మనుషులు కూర్చుని పేపర్లు చదువుకుంటున్నారు. వసారా వెనకగోడలో ఒక దర్వాజా వుంది. దర్వాజాలోనించి పుస్తకాల బీరువాలు కనుపిస్తున్నవి. గోడమీంద కొన్ని పోస్టర్లు వున్నవి. ఆవేళ పత్రికలో ముందు పేజి మీాదంతా హిందూదేశపు బొమ్మ రంగుల్లో పడింది. దాన్ని వీరయ్య అనే రైతు చూస్తున్నాడు.]

వీరయ్య—ఇదేందిరా సుబ్బులూ! యిన్ని పిచ్చిగీతలు గీసి పేపరంతా రంగులు పులిమాడు.

సుబ్బులు—దీన్నిదివరకెప్పుడూ చూడలా?

వీర—చూడలేదే!

సుబ్బు—పైన దాని పేరు రాశాడు చదువు, ఇప్పుడిప్పుడే కూడ బలుక్కుని చదువుతున్నావుగా.

వీర—(చదువుతూ) భ, భాకు దీర్ఘమిస్తే భారత ద, దాకు పత్వమిచ్చి పొల్లు యిస్తే, దే, శ, ము. భారత, దేశం. అంటె మన దేశమేనంటగా. మా చిన్నోడు అన్నాడులే.

సుబ్బు—ఆ మనదే.

వీర——మన దేశమంతా యింతేనా యీకొత్తేనా, మనవూరి కంటె చిన్నదాయేం?

సుబ్బు——అబ్బేకాదు దీన్లో మనవూరు యిక్కడుంది, కనప ట్టంలే ఇదిగో కృష్ణానది. దీని ప్రక్కగా యిదిగో మన వూరు.

వీర——ఇదా మనవూరు యిదా ఓరి తస్సంబడ్డు, యీపళినో డికి మనవూరు ఎట్టుంటదో తెలియనట్టుందే మనూరు పొడుగ్గా మొళ్ళకర్రలాగుంటే చుక్కలాగ గుండ్రంగా ఏశాడేం? (అందరూ నవ్వుతారు)

[అంతవరకు దూరంగా కూర్చున్న రావు దగ్గరకు వచ్చి]

రావు——అంతేలే మామా! మనవాళ్ళ సంగతంతా అంతేలే- కరువుతో వకమూల వల్ల కాడై పోతుంటే నాట్లేసి పంటలు పండించండని పోస్టర్లంటిస్తారు. పోస్టర్లంటిస్తే పంటలు పండుతాయా.

వీర——పోస్టర్లేంటిరా?

సుబ్బు——పోస్టర్లంటే అదిగో ఆ బొమ్మలు. పంటలు బాగా పండించమనీ వూరు బాగుచేసుకోమనీ, బాగా చదువుకో మనీ.

వీర——అది వీళ్ళు చెప్పాలా అంట.

రావు——చెప్పినా మనం చేస్తున్నామా అని.

సుబ్బు——చేయదల్చుకుంటే ఏదైనా చెయ్యచ్చు.

వీర——ఆమాటలు నిజమేలే. మొన్నమట్టుకు మొన్న చూడ లేదంటయ్యా అయిదేళ్ళనించీ అనుకుంటూ చెరువుపూడిక

తీయించగలిగమా ఈశ్వరయ్యగోరు సుబ్బులూ పూను
కుని అయిదొందలు వసూలుచేస్తే 5 రోజుల్లో చెరువు
బాగుపడ్డది.

సుబ్బు—అటువంటి పన్లు చేయించుకోవాలనే యీపోష్టర్లం
టించి ప్రచారం చేస్తున్నారు.

రావు—ప్రచారాలకేం ఎన్నైనా చేస్తారు. పెళ్ళికాని కుర్రా
డివి గనక నువ్వు ఆడిన ఆటల్లా నీకు సాగుతుంది. పెళ్ళ
యిన తర్వాత యీ ఆటలూకట్టేలే. యివ్వాళ పేపర్లో
విశేషాలు విన్నావా వీరయ్యమామా?

వీర— ఏమున్నాయేం ?

రావు—ఏమున్నాయ్! వరదలొచ్చి వకమూల కొట్టుకు
పోయింది. 50 వేలమంది చచ్చారు.

వీర—50 వేలే!

రావు—సరేలే, ఆశ్చర్యమేముంది. మనదేశంలో విమానం
పడితేనే వందమంది చస్తారు.

సుబ్బు—ఇంకోదేశంలో అయితే చావరంటావా ఏం?

రావు—ఇంకోదేశంలో అయితే అసలు విమానాన్ని పడ
నిస్తారా టెలిగ్రాము యిచ్చి ఆపేస్తారు.

వీరయ్య—తస్సదియ్య టెలిగ్రామే!!!

రావు—మరి నీకేం తెలుసు తెల్లాడి సంగతి. మొన్న చైనా
వాడి సంగతి చూడలే. దేశాన్నంతా వక్కసారి చీపురు
కట్టతో తుడిచేశాడు.

వీరయ్య—అవును వెంగ చిత్రరం చూపించావ్ గా అయితే మనవాళ్లకి చేతయింది అలా గోడలమీద బొమ్మలు అంటించడమేనా ఏంటి.? (నవ్వుతాడు)

సుబ్బు—(దగ్గరకొస్తూ) ఇదిగో మామా! పేపర్లోపడింది మనవాళ్ళు కట్టిన తుంగభద్ర ప్రాజెక్టుబొమ్మ.

రావు—అది వీళ్ళుకట్టిందేమిటిలే, బ్రిటిష్‌వాడే PLAN వేసి యిచ్చివెళ్ళాడు. 50 ఏళ్ళక్రిందట.

సుబ్బు—అవును 3 ఏళ్ళసించే వాళ్లు చేయలేని పని మూడు నాలుగేళ్ళల్లో అయిపోయింది.

వీర—(బొమ్మచూస్తూ) అయితే మొన్న యింకేదో చూపించావ్.

సుబ్బు—అది వేరు. అది బీహారులోది మన ఆంధ్రదేశములో కృష్ణమీద మరొకటి కడుతున్నారు.

రావు—ఆ! కడుతున్నారు అయిదేళ్లబట్టీ. నక్కా-టీ యింకా తయారవలేదు. వుపయోగంలోకి రాలేదు.

సుబ్బు—పనిలోకివచ్చి ప్రయోజనం కనిపించాలంటే టైము పడుతుంది. మీ అన్నగారు పిండిమర కడుతున్నట్టున్నారు తయారయిందా.

రావు—ఏదీ? బస్తాసిమెంటు దొరక్క ఆగింది.

వీర—బస్తాసిమెంటు దొరకలే మీకు!!!

రావు—ఈ గవర్నమెంటులో బస్తాసిమెంటే!! హా వెనకరోజు లనుకున్నావా?

సుబ్బ—వెనకరోజుల్లో గవర్న మెంటు వ్యాపారంచేసేది. ఇప్పుడు ప్రాజెక్టులు కడుతున్నారు. తుంగభద్ర తయారయిందా, బక్రినంగాల్ బాగా సాగుతోందా, దామోదర వాలీ పనితొందరగా అవుతోంది. (వీరయ్యవైపు తిరిగి) ఇదిగో! బొమ్మలువేశారు చూడుమామా, ఎంతెంత ప్రాజెక్టులో. (వీరయ్యకు పేపర్లో బొమ్మలు చూపిస్తాడు.)

రావు—(దగ్గరచేరి) ఆ వాటిప్రక్కనే చూడు వరదలు వేలాదిగా ప్రాణనష్టం—రైలుప్రమాదం మంత్రివర్గంలో అంతః కలహాలూ—స్వతంత్ర భారతదేశం అంటే అదా? యిదా?

సుబ్బ—కామెర్లరోగికి లోకమంతా పచ్చగా కనిపిస్తుందట. మీకళ్లకి మీరు చూడతల్చుకుంటే కనిపిస్తుంది. రావుగారూ మీరెల్లా అనుకున్నా ఫరవాలేదు. మీకోశం దేశం ఆగదులెండి.

సుబ్బ—(తెరలోకి చూచి) అదిగో- యీశ్వరయ్యగారొచ్చేశారు. ఇంకా మనవాళ్ళేవరూ చదువుకు రాలేదేం వీరయ్యమామా?

వీర—చెరువుపనితో అందరికీ వళ్ళునొప్పులు లంకెంచుకున్నాయిగా.

[ఈశ్వరయ్యగారు వస్తారు]

ఈశ్వ— ఇవ్వాళ మన విద్యార్థులెవ్వరూ రాలేదా ఏం?

సుబ్బ—వీరయ్యమామ వక్కడూ వచ్చాడు. రా మామా! నువ్వన్నా చదువు మొదలెట్టు.

ఈశ్వ—(సీసయ్యవంక చూసి నవ్వుతూ) మామ కొంచెం దోవలో పడ్డట్టున్నారు.

వీర—ఆ! పడ్డా. పడ్డా. కొత్త కొత్త చందమామ చదువు తుండానుగా.

ఈశ్వ—(నవ్వి) ఇంకేం! మూడో క్లాసులో వేస్తాం నిన్ను.

వీర—వెయ్యండి, వెయ్యండి. నా మనమడితో పాటు ప్యాస వుతాలే.

ఈశ్వ—మా అబ్బాయితోనేగా మొదలెట్టావ్.

వీర—ఆ! ఆ. అంతే. తస్సదియ్యా మొన్న రంగయ్యకి రిజ ష్టరు చేయటానికి ఆఫీసుకాడికి ఎళ్తే- ఏమయిందను కున్నారూ? జమానువచ్చి "చెయ్యిచాపు రంగురాస్తా. ఏలిముద్దర ఏద్దుగాని" అన్నాడు. చిరాకెత్తుకొచ్చింది- తస్సదియ్యా "ఏమయ్యోయ్ కలంయిట్టాతే, సంతక మెడతా" అన్నా.

(నవ్వుతూ సంతకం చేసినట్టు చెయ్యితిప్పుతూ "కటకం వీరయ్య వ్రాలు")

[అందరూ నవ్వుతారు]

ఈశ్వ—ఒకనాడీ దేశంలో కవికానివాడు కనిపించేవాడు కాదట. ఈనాడు కలం పట్టేవాళ్ళే కరువైపోయారు.

రావు—మీ యిద్దరి ధర్మానా యీనాడు బడిపెట్టి సంతకం పెట్టడం చాలామందికి నేర్పారుగా Pronote వ్రాయటానికి బ్రాగానే పనికివస్తుంది.

వీర — అట్టా అనేశావే. చూడు. నేను అయిగోశలాసు అయే దాకా ఎక్కడన్నా ఆగుతానేమో! ఆ.

రావు — ఆ! మీ యిద్దరో ముగ్గురో చదువుకోంగానే తెల్లారిందా ?

ఈశ్వ — చదువుకోంగానే తెల్లారలేదు. తెగబడి దేశానికి చెయ్యాల్సింది చాలావుంది.

రావు — వుంది, వుంది అంటారు. మన చేతిలో ఏముంది ?

ఈశ్వ — అంతా మన చేతిలోనే వుంది. మనం ఏంచేసినా దేశానికి వుపకారమే; మన ఆరోగ్యంగావుంటే దేశానికి ఆరోగ్యం; బలంగావుంటే దేశానికి బలం. మన విద్య దేశానికి విద్య. మన పిల్లలు దేశపు పౌరులు.

రావు — అయితే మనం సరిగ్గా బ్రతకటం లేదంటారా ?

ఈశ్వ — లేదనే అంటాను. మనకోసం మనం బ్రతుకుతున్నాం వుమ్మడిమీద దేశం కోసం బ్రతకటం మర్చిపోయాం. మనం చేసే ప్రతి పనీ, మనకోసం, దేశంకోశంకూడా చెయ్యాలి.

రావు — ఏమిటో మీదంతా చాదస్తం. చేయటానికి మన చేతిలో ఏముంది. అంతా మనమే చేస్తే ప్రభుత్వం ఏం చేస్తుంది.

సుబ్బు — ఏంచేస్తుందో చూడాలంటే యీ పేపరు చదువు. అన్నీ దీన్లో వున్నాయి.

రావు — ఏముందేం. ఎంతసేపూ యీ యేడు ప్రాజెక్టులూ వక సింద్రీ, వక్క చిత్తరంజన్.

సుబ్బ—అన్నో మహాదేశానికి శతాబ్దాలుపడితే మనదేశం ఎనిమిదేళ్లల్లో పూర్తిచేశింది.

ఈశ్వ—ఇంకాచేసేదే, స్వతంత్రంకాంగానే ఆ కాందిశీకుల సమస్యలు అడ్డంరాకుండావుంటే.

సుబ్బ—అందువల్ల కొన్నికోట్ల రూపాయలఖర్చూ, కాలమూ దండగ అవలే మరి;

రావు—దండగ; వీలుగా యిదోసాకు దొరికింది. దేశాన్ని బాగుచేయటాన్కి యీకథలన్నీ అడ్డంవచ్చాయా.

[కుర్రవాడు పరుగెత్తుకువచ్చి]

కుర్రా—నాన్నా......నాన్నా! అమ్మ రమ్మంటోంది.

రావు—ఏం, యిప్పుడెందుకూ.

కుర్ర—ఏమో నాన్న. లైబ్రరీ అరుగుమీద వూకదంపు కబుర్లుచెపుతుంటారు, కేకేసుకు రమ్మంది.

రావు—ఇంటికొచ్చి అటుకులు దంచమంటుదేం.

కుర్ర—కాదు. ఇల్లుకట్టే తాపీపనివాడు వచ్చాడు. మాట్లాడాలట.

రావు—తాపీవాడు వచ్చాడా! వాడిమాటే మరచిపోయా పద పోదాం ... ... ...

అదేమిటి ఎవరా అమ్మాయి?

[అందరూ తెరలోపలికి చూస్తారు]

వీర—ఎవరో కొత్తమ్మాయి లాగుందే.

సుబ్బ—ఎవరన్నా చుట్టమేమో.

రావు—ఇల్లు వెతుక్కుంటూ వస్తున్నట్టుంది.

[వక అమ్మాయి వక మూట చంక నెట్టుకుని వస్తుంది]

వీర—ఎవరమ్మాయివమ్మా. ఎవరింటికి వచ్చావ్.

రావు—మాట్లాడవేం, యీ వూరిదివరకు ఎప్పుడన్నా వచ్చావా?

[అమ్మాయి స్పృహతప్పి పడిపోతుంది]

వీర—అరే! పడిపోయింది.

రావు—అరే, నీళ్లు. నీళ్లు కాసిని పట్రండి. మొహంమీద కొడదాం.

[సుబ్బులు గ్లాసుతో నీళ్ళు తెచ్చి మొహంమీద కొడతాడు అమ్మాయిలేచి "మంచినీళ్లు కాసిని" అంటుంది. సుబ్బులు మంచినీళ్లు యిస్తాడు. ఆ అమ్మాయి మంచినీళ్ళు త్రాగింది]

ఈశ్వ—ఏవూరమ్మా మీది. ఎవరు నువ్వు.

అమ్మా—ఏవూరని చెప్పను! నాదీయీ దేశమే. అంతే. అంతకంటే మరేం చెప్పలేను.

ఈశ్వ—అదేమిటమ్మా. సరిగ్గా చెప్పు. ఇట్లా వంటరిగా వచ్చావేం.

అమ్మా—(లేచి) దేశంమీదపడి అడుక్కుతినమని మావాళ్ళే యింట్లోనించి గెంటేశారు.

వీర—మీవాళ్ళా? మావాళ్ళంటె..... మీ ...

అమ్మా—నావాళ్ళే. నాసహోదరులు.

ఈశ్వ—మరి నీకు తల్లిదండ్రులు లేరా ?

అమ్మా—లేరు; భాగాలు పంచుకున్న సహోదరులకు భారమై పోయాను. నన్ను పోషించలేక రాత్రికి రాత్రి పొమ్మన్నారు. వేరే దిక్కు లేక ఎక్కడో అక్కడ పొట్టపోసుకుందామని బయలుదేరాను. ఈ దోవ యిట్లా లాక్కొచ్చింది.

ఈశ్వ—ఫరవాలేదమ్మా. చాలా నీరసంగా వున్నావు పాపం. అంతా తర్వాత చెప్పుదుగాని లే.

కుర్ర—పదనాన్నా; అమ్మ కోప్పడుతుంది.

రావు—ఆగరా. ఎప్పుడూ "అమ్మ అమ్మ" అంటావ్.

కుర్రా—నాకేం? నిన్నే కోప్పడుతుంది.

రావు—కోప్పడితే కోప్పడిందిలే.

కుర్రా—ఆ, యిప్పుడల్లాగే అంటావ్. కోప్పడుతున్నప్పుడు కొట్లోదూరి దాక్కుంటావ్.

ఈశ్వ—వీరయ్యా! యీ అమ్మాయిని ముందు మీయింటికి తీసుకెళ్ళు. తర్వాత తీరుబడిగా తిండితిప్పలూ సంగతి చూద్దాం.

వీర—అదేటండోయ్! బస మా యింట్లోనూ తిండి మీ యింట్లోనూనా! రాఅమ్మా, మాయింటికి రా. మా పెద్ద పిల్ల బ్రతికుందనుకుంటాను. లేఅమ్మా (కళ్ళు నీళ్లు తిరిగాయి) నీ పుట్టింట అడుగెట్టినట్టే ననుకో తల్లీ- లే.

అమ్మా—నాఅదృష్టంకొద్దీ మీకంటపడ్డాను. మీ ఆదరమే చాలు. రేపట్నుంచీ నాపొట్ట నేనే పోసుకుంటాను. ఈపూటకు ఆశ్రయమివ్వండి చాలు.

ఈశ్వ—అన్నీ తర్వాతఆలోచించుకోవచ్చు. అఖండభారతం ఎంతమందికో ఆశ్రయమిచ్చింది. నీలాటివి వొక బరువు కాదులే.

[వీరయ్య అమ్మాయిని తీసుకువెళ్లాడు.]

రావు—(అటే చూస్తూ) పాపం.

కుర్రా—రానాన్నా వెళ్దాం.

రావు—ఛీ! పో వెధవ. నువ్వొకడివి (ఈశ్వరయ్యతో) వీర య్యాకు, ఆ అమ్మాయుని చూడంగానే అతని పెద్దకూతురు జ్ఞాపకం వచ్చినట్టుంది ఈశ్వరంగారూ. బ్రతికుంటే ఆ పిల్లకు ఈ యీడే వుండేది.

ఈశ్వ—ఎన్ని చిత్రాలు జరుగుతాయీ దేశంలో.

సుబ్బ—(రావుదగ్గరకెళ్ళి) తాపీమేస్త్రీ మీకోసం కాచు కూర్చున్నట్టున్నాడు రావుగారూ,

రావు—కూర్చుంటే కూర్చున్నాళ్ళేవయ్యా. ఆ అమ్మాయిని చూస్తుంటే కడుపు తరుక్కుపోతుంది. ఆ పిల్లకు యింత అధారం చూపించాలి అందరం కలిసి.

సుబ్బ—అవును. ఆధారం చూపించా లా అనాధకు రావు గారూ, యిదీవక కాందిశీకుల సమస్యలాంటిదే. ఇంటి పనులు అవతలకునెట్టి అమ్మాయి సంగతి మీరెల్లా ఆలో చిస్తున్నారో అల్లాగే ప్రభుత్వంకూడా కాందిశీకులసంగతి ముందు చూశింది.

రావు—అవున్లే. అదీనిజమేకాని వొకటి తర్వాత వొకటి చెయ్యాలిగాని, రెండు అయిదేళ్ళప్లానులూ వక్కసారే

తలపెట్టి లుంగచుట్టి మింగాలంటే ఎట్లా. ఏడీ. కుర్రాడు యింటికి వెళ్ళాడా ఏం? కొంపదీసి దాంతో అంతా చెప్తాడు. వస్తా. (వెళ్తాడు)

ఈశ్వ—ఇంకా మనవాళ్ళు చదువుకోటానికి రాలేదేం యివ్వాళ?

సుబ్బ—వచ్చిన వీరయ్యకూడా తిరిగి వెళ్ళాడు. అదిగో అమరయ్య వస్తున్నాడు.

[అమరయ్యరాగా]

ఏం అమరయ్యగారూ మనవాళ్ళందరూ ఏరీ!

అమ—ఏం మనవాళ్ళో? ముందీకాలికి మందేయండి.

సుబ్బ—దెబ్బతగిలిందా?

అమ—తగలదూ మనగోడ్డుమీద కాలెడితే. మూడేళ్ళనించీ దానిమీద గుప్పెడు మన్ను పోశారుగనుకా. ఎక్కడ చూచినా మోకాలిలోతున గుంటలు. ఆస్పత్రికి వెళ్ళి మందేయమంటే, టైమ్ అయిపోయిందంటాడు కాంపౌండరు.

సుబ్బ—పోన్లే. ఇక్కడ ప్రథమచికిత్స పెట్టెవుందిగా, మందు వేస్తాను ఆగు.

[లోపలికివెళ్ళి పెట్టెతెస్తాడు]

అమ—అది జ్ఞాపకంరాకే అటుపరుగెత్తా. అయినా యివెక్కడి రూల్సులండీ, ఐదుగంటల తర్వాత ఎవరికీ దెబ్బలు తగలవూ.

ఈశ్వ—అహ తగలవు, తగలకూడదు.

అమ—బాగాఅన్నారు. నయమే. అయిదుగంటలతర్వాత యిల్లువిడిచి బయటకురాకూడదన లేదు.

ఈశ్వ—అవును. రాకూడదు. వస్తే ఎదురుదెబ్బలు తగులుతాయి.

అమ—అందుకని బయిటికిరాకుండా ఎట్లా.

ఈశ్వ—వచ్చి చూడకుండా కళ్ళుమూసుకు నడిస్తే ఎట్లా?

అమ—చూడకుండా నడిస్తే కాలే విరిగేది. చూసినడవబట్టే ఎదురు దెబ్బతో ఆగింది.

ఈశ్వ—ఈవాదన్లెందుకు అమరయ్యా. దెబ్బతగిలిన రాయినేం చేశావ్ ?

అమ—ఏంచేస్తాను. చిరాకెత్తుకొచ్చి కోపంతో విసిరి అవతల పారేశాను.

ఈ—అల్లా విరిసిపారేశే బదులు కోపంతో ఆరాతిని వీధి గుంటలోనే పారాస్తే, గొయ్యిపూడేదీ నీకోపం తీరేదిగా; అల్లా రాళ్ళని దూరంగా పారేస్తే, ఆగొయ్యి ఎట్లాపూడుతుంది.

అమ—పూరుకోండి మీాదంతా వక చాదస్తం. పంచాయతీ బోర్డొచ్చి పదిమాసాలయింది; పట్టుమని గుప్పెడు మట్టి పోసిందీ రోడ్డుమీాద.

ఈశ్వ—పంచాయతీబోర్డు పనిచేసేదాకా, మనం పూరుకుండాం ఎదురుదెబ్బలు మనకితగిలినా, పనిచెయ్యాల్సింది పంచాయతీబోర్డే.

అమ—అందుకని పనికట్టుకుని గుంటలు నన్నే పూడ్చుమ న్నారా ఏం?

ఈశ్వ—ఆ నీ యింటి ముందు గుంట వుంటే నిన్నే పూడ్చు కోమంటాను. అది నీ పనే.

అమ—అయితే పంచాయతీబోర్డని వకదాన్ని ఎన్నుకోటం ఎందుకూ ? దండగ. వూరుకోండి యీశ్వరయ్యగారూ మీసంగతి ఎప్పుడూ యింతే, మొన్నమట్టుకు మొన్న పంచాయతీబోర్డు చెయ్యాల్సిన చెరువుపని చందావేయించి మీరే చేయించారు. మనం పనిచేయిస్తే ఫంచాయతీ బోర్డెందుకూ ఏడవను ?

[రావు గబగబా ప్రవేశించి]

రావు—కొంప మునిగింది అమరయ్యా! మీ యింటి తలుపు తాళంవేసి రాలే తలుపు తీసి వుందేం ?

అమ—ఆ. తాళం వేసేవచ్చానే.

రావు—మరి తలుపు తీసివుంది. లోపలేదో గబగబ మోత మోగుతుందికూడ

అమ—దొంగలు దూరలేదు గదా !

రావు — ఏమో.

అమ—పదండి చూద్దాం.

సుబ్బు—ఆగండి కట్టు కట్ట నివ్వండి.

అమ—కట్టు మళ్ళా వచ్చి కట్టుకోవచ్చులేవయ్యా.

ఈశ్వ—ఆగు అమరయ్యా, దొంగల్ని పట్టటానికి పంచా యతీ బోర్డువారు పారావాణ్ణి పెట్టారు. వాణ్ణిరానీ.

అను—పారావాడొచ్చేదాకా దొంగను కాచుక్కూర్చుంటారా ?

ఈశ్వ—పంచాయతీ బోర్డుపని చేసేదాకా ఎగురు దెబ్బలు తగలకుండా వుంటాయా ?

అను—అప్పచెప్పారులెండి మాట అసల్సంధ్యవేళ దొంగలు పడి దోచుకుంటుంటే.

[అనురయ్య రావు పరుగెత్తుకు వెళతారు]

[వీరయ్య ప్రవేశించి సుబ్బులు చేతిలోవున్న First Aid Box చూసి]

వీర—ఇదేం పెట్టె సుబ్బులూ—

సుబ్బు—ఇదా ? చిన్న మందులపెట్టెలే. మన Library కి Govt వారు సప్లైచేసారు.

ఈశ్వ—ఇంతకూ అమ్మాయిని యింట్లో దిగవిడిచావా ?

వీర—ఆ– పాపం, యివ్వాళ ఆ అమ్మాయి భోంచెయ్యనే లేదుటండీ. బలే అభిమానంగల పిల్లలాగవుంది. న్వారికే మాయింట్లో తిండీ తినకూడదనుకుంది కామాలూ, చిన్న పిల్లకి దారంతో అల్లిన పూలు యిచ్చింది.

సుబ్బు—అహా !

వీర—గాన్లు కుట్టగలదంట. పువ్వులు అల్లగలదంట. ఆపనీ, యీపనీచేసి రేపట్నించీ, తన పొట్ట తనే పోసుకుంటుందంట.

సుబ్బు—(ఆలోచిస్తూ) మనం యిక్కడ కుట్టుపని నేర్పే బడి కూడా పెడితే,

ఈశ్వ—పెట్టొచ్చు. వక మిషను కొని.... గవర్న మెంటు
యిట్లాంటి వాటికూ్కడా Grant యిస్తుందేమో?

సుబ్బు—ఆ మన Library తరపున ఏర్పాటు చేద్దాం. సహాం
మనంయిస్తే, సహాం ప్రభుత్వంవారు యిస్తారు.

వీర—సహాం యిస్తారా! ప్రభుత్వం!!!

సుబ్బు—ఆ, సహామిస్తారు. మొన్న మొన్న నేమన * వూరిలో
యీమిషన్ లుకొని బీదలకు ఉచితంగా బట్టలు కుట్టి యిచ్చే
సంస్థ వొకటి పెట్టారు.

వీర—ఆవూరిలోని గవర్న మెంటువారు యిచ్చిన వేమిటి.

సుబ్బు—ఆ వొక్క ఆవూరిలోనేకాదు. కొన్ని వందలున్నయి
అట్లా. యికనువ్వు చదువు మొదలెట్టు. యింకెవ్వరూవచ్చే
ట్టులేదు.

వీర—ఓ (పుస్తకంతీసి చదువుతూ) శ్రీరాముడు మంచి
రాజు. శ్రీ...కృ...ష్ణు...డు శీకుష్టుడు.

సుబ్బు—శీకుష్టుడు కాదు...శ్రీకృష్ణుడు.

వీర—అదే 'శీకుష్టుడు'—.

సుబ్బు—శ్రీకృష్ణుడు "శ్రీకృష్ణుడు" అనాలి.

---

* Note :— ఈగుర్తు వున్నచోట ప్రదర్శనంజరిగే వూరిలో యిటువంటిసంస్థలుంటే ఆసంస్థలపేర్లుగాని లేదా ఆవూరిచుట్టుప్రక్కలవున్న వూళ్ళల్లోని సంస్థలపేర్లుగాని వుదాహరించవచ్చు. ఇటువంటి సంస్థలు చాలాచోట్ల వున్నవిగనక ఇబ్బంది వుండదు. ప్రచారము ఆసంస్థలకు కూడా జరుగుతుంది. వూరిపేరు ఎప్పటికప్పుడు ప్రదర్శకులు మార్చుకోవాలిగనక యిక్కడ వూరిపేరు వుదాహరించలేదు.

వీర——అదా! శ్రీకృష్ణుడు అదేలే నేననేది. ఆపేరేలే "అల్లరి పిల్లవాడు" ఒక్ ఈసంగతి నే నెరగనేంటి? "గాంధీగారు గొప్పవాడు" గొప్పవాడేంటీ మా ఆత్మ్మడైతే.

[రావు, అమరయ్య వస్తారు.]

ఈశ్వ——ఏమిటి సంగతి, దొంగ లేనా?

అమ——దొంగలుగాదు దొరలే. (నవ్వుతాడు)

రావు——దొర! వీడా దొర! వెధవన్నర వెధవ! వాళ్ళింట్లోకి ఎందుకెళ్ళావురా నువ్వు. (పిల్లవాణ్ణి కొట్టబోతాడు)

ఈశ్వ——ఏమిటీ వీడా జొరబడ్డది!

రావు——వీడే. దొంగ వెధవ. ఏముందిరా వాళ్ళింటిలో చెప్పవేం, మొద్దులాగా?

కుర్రా——నా బంతి వుంటేనూ.

రావు——బంతా?

కుర్రా——వాళ్ళబ్బాయి నాబంతి లాక్కెళ్ళి దాచుకున్నాడు.

రావు——ఛీ వెధవా. అబద్ధాలాడతావ్. బంతి నీ కెక్కడిది?

అమ——ఏదో చిన్నతనం లెండి.

ఈశ్వ——ఈమాత్రందానికి ఎంత హడావిడిపడ్డారు!

రావు——హడావిడేమిటండీ. హడలిపోతేను "తలుపుతీసివుంచేమా" అని లోపలికి తొంగి చూశాం. నన్ను చూచి అవతల గదిలోకివెళ్ళి నక్కాడు, వెధవ. గాభరాపడిపోతే.

సుబ్బు——ఇకరండి అమరయ్యగారూ! తీరుబడిగా కట్టు కట్టిప్పండి (కట్టు కట్టుతూ) ఈశ్వరయ్యగారూ అమరయ్య

గారికిక యిలాంటి దెబ్బలు తగలకుండా మనం మనరోడ్లన్నీ బాగుచేసుకోకూడదూ. బొత్తిగా రోడ్లన్నీ పాడైనయ్యి.

ఈశ్వ—రోడ్లన్నీ బాగుచేయించుదామా?

సుబ్బు—ఆ రోడ్డుమీాది గుంటలు అన్నీ పూడ్పించి చక్కగా రోడ్లువేసేసుకుంటే......

రావు—అయితే గుంటలు పూడ్చే వారం ప్రారంభించండి.

అను—దానికి డబ్బో! మళ్ళా చందాలా?

సుబ్బు—తప్పేముంది; ఎవరో పనిచేసేవరకూ ఎప్పుడూ ఆగకూడదు. మన పనిమీాద మనకే శ్రద్ధలేక "ఎవరో చేస్తా" రని ఆగిపోతే ఎప్పటికీ పనులన్నీ అవుతవి; మనం కొంత చందావేస్తే గవర్నమెంటు కొంత యిస్తుంది.

ఈశ్వ—మనం డబ్బే యివ్వనక్కరలేదు. డబ్బుకు బదులు మనమే పనిచేసినా చాలు.

సుబ్బు—రేపు ఈ పనిచేస్తే ఎల్లుండి తగలాల్సిన దెబ్బ తప్పుతుంది. మనం రాత్రికి గ్రామస్థులందర్నీ పిలిచి మాట్లాడదాం.

రావు—పిలుస్తాం కష్టపడి, పనిచేయటాన్కి వచ్చేవాళ్లెంత మందీ?

[సుబ్బులు అమరయ్యకు కట్టు కడుతూ కడుతూనే ఈ మాటల్లోపడి కట్టుగుడ్డతో గూడా వెళ్ళి రావుతో మాట్లాడుతాడు, కట్టుగుడ్డ రెండోకొన అమరయ్య కాలికి చుట్టబెట్టివుంది. అతను సుబ్బుల్ని వెళ్ళనివ్వకుండా పట్టుకుంటాడు. సుబ్బులు మాట్లాడుతూనే కట్టు పూర్తి చేస్తాడు]

సుబ్బ — అంతా రావాలి. అందరూవస్తారుగూడా. రోడ్డు మీదవచ్చే బండి గుంటలోపడి లేవకపోతే దాన్నిపైకి తీయడానికి పడే కష్టం రోడ్డు బాగుచేయటానికి పడితే చాలదూ.

రావు—అది అందరికీ తట్టాలిగా. మొన్న చెరువుపనికి ఎంద రొచ్చారు? మీమాట కాదనలేక ఎవరో కొందరొ చ్చారు.

సుబ్బ—ఈ మాటలూ కాదనలేక యింకా కొందరొస్తారు. మన యింటిని మనం శుభ్రంగా వుంచుకున్నట్టే యిది కూడాను. ఇంటికి మనం అన్ని సదుపాయాలూ చేసుకో టంలే. యిల్లు మనదీనీ వూరు మరొకరిదీనా? కాదుగా; మన అందరం తల్చుకుంటే మన యింటిలాగే వూరినీ యీ దేశాన్నీ యీ ప్రపంచాన్నే మార్చగలం.

రావు—ఇదంతా ఆలోచించే దెవరయ్యా!

సుబ్బ—ఆలోచించకపోతే, మనం ఆలోచించేట్టు చేద్దాం.

రావు—ఆలోచించాలంటే బుర్రవుండాలిగా. యీ వూళ్ళో ఎక్కడుంది ఆ బుర్ర.

సుబ్బ—మీకు లేదా ?

రావు—నాకుంటేసరా అబ్బాయీ! నువ్వెన్ని కబుర్లన్నా చెప్పు. యీ వూళ్ళో యీమాదిరి లాభంలేదు. మొన్న చెరువు పని చేయించారా! అంత కష్టపడితే చివరికి ఏమన్నారో తెలుసా! "యీ తడవ పంచాయతీ బోర్డు వోట్ల కోసం" అన్నారు.

అమ—ఎవరా అన్నది ?.

రావు—ప్రతివాడూ అంటున్నాడు. ప్రయివేటుగా మీరు ఎన్నన్నా చెప్పండి. యీమాటు పనిలోకిదిగి పాటుపడే వాళ్ళకన్నా గట్టున నుంచుని నవ్వేవాళ్ళే ఎక్కువుంటారు అందాకా ఎందుకు? ఈ తడవ యీవూరి ప్రెసిడెంటుగా రే పూనుకుని పనిసాగకుండా చేస్తారు.

ఈశ్వ—ఎందుకు చేస్తారు ?

అమ—చేస్తారు లెండి.

రావు—మొన్న గడ్డిపాట పాడటంలో, అమరయ్యకీ ప్రెసిడెంటుకీ మాటామాటా వచ్చాయిగా.

సుబ్బ—దానిదేముంది? ఆవ్యవహారం రాజీఅయిందిగా. ఈశ్వరయ్యగారు "పార్టీలు పాడొద్దనీ" చెప్పి లైబ్రరీ తరఫున పాడించారుగా.

రావు—రాజీ అయిందనుకో. కాని మనసులో ముసుగు లెక్కడికి పోయాయి.

ఈశ్వ—ఈముసుగులే ముందు పోగొట్టాలి. అనవసరపు కక్షులతో మనకాలాన్నంతా వృధాచేస్తున్నాం.

అమ—అనవసరమంటే నేనొప్పుకోను "ప్రెసిడెంటుఅయ్యాడు గదా" అని అంతా ఆళ్ళే దోచుకోటమా.

ఈశ్వ—నిన్ను దోచుకోనివ్వలేదని నీకష్టంగా వున్నట్లుందే.

అమ—నన్ను దోచుకోనివ్వలేదని కాదండీ.

ఈశ్వ—నీమాటలోనే ఆభాసం వుంది. ఎవరోవొకరు తినాల్సిందేగదా అనుకుంటే సరిపోదూ.

అను—అల్లా అయితే అసలు అంతేవుండదు. మనం కాస్త బెదిరిస్తుంటేనే యిల్లావుంది.

రావు—అసలు తికమక అది కాదండీ. అమరయ్యా అన్నకొడుకు పాటపాడకపోతే అమరయ్య కల్పించుకునేవాడే కాదు.

అను—ఛ, అదేమిటి? ఎవరయితే ఏం. న్యాయం సంగతి చూడాలిగాని.

రావు—దబాయించకులే, న్యాయమైతే నీకేం, అన్యాయమైతే నీకేం? అన్నకొడుకున్నాడనిగాని, అన్నకొడుకు అవతల పార్టీవాడు లెండి.

ఈశ్వ—ఇవన్నీ అవతలపెట్టండి. యీపార్టీలు ఏకంచేయటానికి ప్రయత్నిద్దాం. ప్రయత్నం సాగితేసరే. లేదా? కల్సివచ్చిన వాళ్లని కూడగట్టుకుని చేయగల్గినంతవరకే చేద్దాం.

రావు—ఎంతమందిని కలుపుకుని చేసినా, మనవల్లేమవుతుంది. గవర్నమెంటు తల్చుకోవాలి. కర్రపుచ్చుకుని పనిచేయించాలిగాని.

సుబ్బు—ఆపని మనగవర్నమెంటు ఎప్పటికీ చేయదు.

రావు—చెయ్యకపోతే నుసం యింతే, మీ రెంత చేసినా గొత్తితోక పొడుగు సాగుతుందా. మీదంతా వెర్రిగాని.

అమ—(వకవైపుకు పరకాయించి చూస్తూ) అదేమిటి ఆ మంటలు?

[అందరూ ఆవైపుకు చూస్తారు]

సుబ్రా—ఇళ్ళంటుకున్నాయి.

ఈశ్వ—ఎలా అంటుకున్నాయి?

రావు—దేశంఅంతా యిలా మండిపోతుంటే, యిళ్ళంటు కోటంలో ఆశ్చర్యమేముంది.

అమ—అబ్బ! కళ్ళముందు ఎన్నిళ్ళు కాలిపోతున్నాయి!

రావు—అసలే వేసంకాలం కాదూ. సర సర వూరంతా చుట్టేసినట్టుంది.

అమ—అదిగో పంచాయితీబోర్డు ప్రెసిడెంటుగారిల్లు అంటు కుంది. (నవ్వుతాడు)

ఈశ్వ—నవ్వాల్సిన సమయముకాదు అమరయ్యా! ఆపద లందరికీ వస్తాయి. పదం డందరం సహాయంచేద్దాం.

సుబ్బ—పదండంతా. ప్రతిబిందె ప్రతి చెంబూ పట్టుకురండి.

[రావు తప్ప అందరూ పరుగెత్తుతారు, వీరయ్య లోప లికెళ్ళి కూజా తీసుకువస్తాడు. అప్పటికి ఆ అమ్మాయి సౌభాగ్య వచ్చి మంటలవైపుకి వెళుతుండగా, వీరయ్య ఆమెను చూచి]

వీర—నువ్వెక్కడికమ్మా సౌభాగ్యమ్మా?

సౌభా—అక్కడికే.

వీర—మంటలార్పటానికా.

సౌభా — అవును.

వీర — మేమంతా వెళ్లుతున్నాంలే. నువ్వింటికెళ్ళు.

సౌభా — మీకు నీళ్ళన్నా అందిస్తాను.

వీర — మేమంతా చాలమూ, నువ్వొక్కదానివి రాకపోతే మునిగిపోయింది లేమలే.

[సుబ్బులు పరుగెత్తుకు వచ్చి]

సుబ్బు — నువ్వింకా యిక్కడే వున్నావేం మామా! రా తొందరగా.

[అని చేతిలో కూజా లాక్కుపోతాడు]

వీర — నా చేతిలో కూజా లాక్కుపోతావేం? యీవక్కటే తక్కువైందా అక్కడ? (సౌభాగ్యవంక తిరిగి) నువ్వింటికి పో అమ్మా,

సౌభా — కాదు. వూరి ఆపదలో నేనూ ఆదుకుంటాను, నన్నాపకండి. తొందరగా పదండి,

(ఇద్దరూ తొందరగా వెళతారు)

రావు — పదండి నేనూ వస్తాను, పదండి.

(వెనకనే వెళ్తాడు)

[అందరూ సామాన్లు తెచ్చి Library అరుగుమీద పెట్టి వెళ్తూ వుంటారు. రావుకూడా సామాన్లు మోసుకువచ్చి అక్కడపెట్టి,]

రావు — అదిగో, ఆమూల యింకోయిల్లు అంటుకుంది. అటు వెళ్ళండందరూ, నేనీ సామాన్లు చేరవేస్తాను.

[అందరూ వెళ్లారు. ఈశ్వరయ్య కొంత సామానుతో వచ్చి పడేసిపోతూ కుర్రాడితో సౌభాగ్య బిందెలతో నీళ్ళు తెచ్చి సుబ్బులుకు అందిస్తుంది. సుబ్బులు ఖాళీబిందె సౌభాగ్యకు యిచ్చి నిండుబిందె తీసుకుపోతాడు. ఇది పొడుగునా సాగుతూంటుంది.]

ఈశ్వ—ఇంకా బిందెలు పట్రమ్మను.

[చెరొక వైపుకీ వెళ్తారు. మరికొందరు బిందెలు పుచ్చుకు పరుగెత్తుతారు. సౌభాగ్య సామాను మోసుకువచ్చి అక్కడపెట్టి తిరిగివెళ్తుంది. కుర్రాడొచ్చి సామానుచూసి, పెట్టె తియ్యబోతాడు ఇంతలో సుబ్బులు రావటంచూచి ఆగుతాడు. సుబ్బులుకి చొక్కానిండా మసి ఉంటుంది. సామానక్కడే పడేసి అలుపు తీర్చుకుంటాడు. అప్పు డొకడు బిందె నీళ్ళతో వెళ్ళుతూ ఉండడం చూసి, అవి తను ఎత్తుకు పోతాడు.]

వాడు—ఆ బిందె మాదయ్యా, ఆబిందెమాది!

[తనూ వెళ్తాడు. కుర్రాడు పెట్టెవెతికి ఏదో తీస్తాడు. రావు సామానెత్తుకువచ్చి కుర్రాణ్ణిచూసి]

రావు—ఏమిట్రా, వెతుకుతున్నావు ?

కుర—(ఖంగారుపడి) ఏంలే, ఏంలే.

రావు—నీచేతిలో దేమిటి ?

కుర—బొంగరం.

రావు—ఎందుకు తీశావు ?

కుమ్ర—ఆడుకుందామని.

రావు—ఆడుకుందామని దొంగతనంగా తీస్తావా?

సుబ్బు—(సామానుతో వచ్చి రావునుచూసి ఆగి) ఇక్కారిక్కడే ఉన్నారే! అటువైపు యింకా మంటలార లేదు. [redacted]

[సామాను అక్కడపడేసి వెళ్ళబోతూ ఉంటాడు]

రావు—ఏంలేదు యిక్కడ కుమ్రివాడు వంటరిగా ఉంటేనూ...

సుబ్బు—రండి, తలావక చెయ్యి వేస్తేనేగాని మంటలారవు.

(సుబ్బులు వెళ్తాడు, రావు కుమ్రవాణ్ణి కొట్టటమా, వెళ్ళి మంటలార్పటమా అనే సందిగ్ధంలో పడి చివరికి)

రావు—సరే, నీసంగతి తర్వాత చెప్తాను. ముందు ఇంటికి పో (వెళ్తాడు)

[నీళ్ళు తీసుకువస్తున్న సౌభాగ్య, బిందెను అందుకోటానికి వచ్చిన సుబ్బులు వంటరిగావున్నారు. సుబ్బులు బిందె కిందపెట్టి అలసిపోయినట్లు ఊపిరివదల్తాడు.]

సౌభా—చాలా అలిసిపోయినట్లున్నారు. కాసేపుకూర్చొండి, బిందె నేనే తీసుకుపోతాను.

సుబ్బు—అహా, అక్కర్లేదు... నేనే.

సౌభా—కాదు, కూర్చొండి కాసేపు... నేనే...

సుబ్బు—ఫర్వాలేదు. నేనే.

(బిందె యిద్దరి చేతుల్లోవుంది. యిద్దరూ నవ్వారు. చివరికి నీళ్ళు తీసుకు వెళ్ళారు.)

[అందరూ సామాన్లు చేరవేస్తూ ఉంటారు. తరువాత కొంతసేపు ఎవరూరారు. మరి కొంతసేపు అయినతరువాత

సుబ్బులూ, వీరయ్యా, అమరయ్యా, ఈశ్వరం, వారితోబాటు పంచాయితీబోర్డు ప్రెసిడెంటుగారు వస్తారు. అందరూ అలిసి పోయినట్లు కనిపిస్తారు.]

అమ—కాసేపట్లో ఎన్ని యిళ్ళు నాశనమయిపోయాయి!

వీర—ఇది నయం కాదూ! నా చిన్నతనంలో యీకాసేపట్లో ఓసారి ఊరు పూరంతా నేలమట్టమయింది. ఇప్పుడిది లెక్కా, జమా! పదిమందీ తలపడమట్టి యింతటితో ఆగింది.

ప్రెసి—మరే! మాపైపు యిళ్ళుకాలిపోతున్నప్పుడు మీారందరూ ఇంత సాయంచేస్తారనుకో లేదు. ఈశ్వరయ్యగారూ! నేను కలలోకూడా అనుకోలేదు మీా అందరూ ఇట్లా ఆదుకుంటారని.

ఈశ్వ—మీారూ, మేమూ ఏంటండీ! అందరం ఒకగ్రామంలో ఉండటంలే!

ప్రెసి—మరే! (సుబ్బులువంకచూచి) యీా సుబ్బులుమరీనూ. ఎక్కడచూచినా తనేఅయితే! (సౌభాగ్యరాగా, ఆమెను చూచి) ఆకొత్తమ్మాయి ఎవరండీ! తన సొంత యిల్లయినా అంతకష్టపడేదా!

అమ—పాపం. యివ్వాళే యీా ఊరు వచ్చిందిలెండి.

ఈశ్వ—అందరం కలిసి మంటతో ఎంత పోట్లాడాం! ఇంత బలం ఎక్కణ్ణించి వచ్చిందో యీారెక్కల్లోకి!

రైతు—(పరుగెత్తుకువచ్చి) రావుగారు కాలుజారి నిప్పుతో పడ్డారు.

[అందరూ అదిరిపడి 'ఆఁ, ఆఁ, ఆఁ' అంటారు. సుబ్బులు పరుగెత్తుతాడు వెనుకనే కుర్రవాడు నాన్నా, నాన్నా అంటూ పరుగెత్తుతాడు.]

రైతు—అదిగో తీసుగొస్తున్నారు.

ఈశ్వ—అరే! ఎలాపడ్డాడూ!

[రావును మోసుకు వస్తారు]

రైతు—కాలు జారి గోడమీదనుంచి పడ్డారు.

కుర్రా—(ఏడుస్తూ) నాన్నా, నాన్నా.

రావు—ఛీ వెధవా, నీవల్లే యింత—

సుబ్బు—ఇంటికి తీసుకు వెళ్దాం పట్టండి.

ఈశ్వ—ఒకరెవరన్నా డాక్టరుగారి దగ్గరకు పరిగెత్తండి,

[ఇతర రైతులు సాయంచేసి రావుగార్ని తీసుకెళ్తారు]

ఈశ్వ—పాపం. ఎప్పుడూ చెయ్యితీసి చెయ్యిపెట్టనిమనిషి ఈయనా ఎగబడ్డాడు. నిప్పులోకి రాకపోయినా సామాన్లు చేరేశాడు. అదీ సహాయమేగా అందరూ పట్టుదలగా ఏదో వొకపని చేస్తే మనకి చేతకాని దేమిటి? అబ్బ ఎంత పట్టుదలతో ఎంతశక్తితో, యీ ఆపదతో పోట్లాడాం. యీశక్తి యీ వుత్సాహం గ్రామాన్ని బాగుచేసుకోటానికి వుపయోగిస్తే ఎంత బాగుంటుంది ప్రెసిడెంటుగారూ,

ప్రెసి—ఆ..

ఈశ్వ—మీరు అమరయ్యా పార్టీకక్షలు మర్చిపోవాలి.

ప్రెసి—ఆ, మర్చిపోతాము.

ఈశ్వ—నువ్వు అమరయ్యా?

[సుబ్బులు తిరిగి ప్రవేశము]

అమ—తప్పకుండా మర్చిపోతాము.

ఈశ్వ—కక్షలన్నీ మర్చిపోయి వూరికోసం అందరం పాటు పడదాం.

సుబ్బ—ఎప్పుడో పాటుబడటంకాదు ఈశ్వరంగారూ! అగ్ని వాతపడి ఆక్రోశిస్తున్న అనాథుల మొర వినపడటంలే. పదండి. ఆ కాలిపోయిన కూలివాడలన్నీ తిరిగి కట్టుకుందాం.

ఈశ్వ—ఇళ్ళు కట్టుకోటమేకాదు, వూరినే మార్చి కట్టుకుందాం. అన్ని కుటుంబాలూ నడుంకట్టి ముందుకురండి. అందరికోసం అందరం పనిచేసి భూతలాన్ని స్వర్గసీమ చేసుకుందాం.

సుబ్బ—పట్టుదలతో భగీరథుడు గంగాదేవినే భూలోకానికి లాక్కొచ్చాడు. పట్టుదలతో మనం గ్రామపు నడిబొడ్డును తిరిగి కట్టుకుందాం.

సాభా—పదండందరూ, పాడైపోయిన వూరిని తీర్చిదిద్దుకుందాం.

అమ—బారుబారులుగా, తీరుతీరులుగా వీథుల నిర్మిద్దాం.

సుబ్బ—వీథి వీథినా వినువీథుల నంటే వీడుల నిర్మిద్దాం అందరూ పదండి ... ... ... పదండి ...

[అమితమైన వుత్సాహంతో అందరూ వెళ్తారు]

తెర

## రెండవ రంగము

[మూడు నెలల తర్వాత అదే లైబ్రరీ అరుగు. సౌభాగ్య కుట్టిన గుడ్డల బొత్తులు తెచ్చి యిద్దరి మనుషులికి యిస్తుంది. వాళ్ళు చురుగ్గా వెళతారు. రావు కొడుకు నిల్చున్నాడు, వాణ్ణి చూసి సౌభాగ్య]

సౌభా—మీ యింటి ప్రక్కవారి గుడ్డలుగూడా తయారు అయినాయి, ఇచ్చొస్తావా?

కుర్రా—— ఓ ...

[సౌభాగ్య లోపలి కెళ్ళి తిరిగి గుడ్డలు తెచ్చియిస్తుంది. చేతికి కట్టుకట్టుకుని రావు వస్తాడు ]

(సౌభాగ్య, రావునుచూసి) సౌభా—ఓహో! రావుగారా!

రావు—మరేనమ్మా, నేనే. పనిమీదవున్నట్టున్నావ్.

సౌభా—మరేం లేదండీ; నిన్న కుట్టినగుడ్డలు ఎవరివి వారికిచ్చి పంపిస్తున్నాను.

రావు—ఇవ్వాళకూడా ఎవ్వరూ యిటు రాలేదల్లే వుంటే. వీరయ్యా రాలేదు, ఈశ్వరయ్యా రాలేదు.

సౌభా—లేదు రాలే.

రావు—ఇదివరకటి రోజుల్లో ఈ అరుగుమీద యీపాటికి పాతికమందిచేరి బాతాఖానీ కొట్టేవాళ్ళు, మూడు నెలల బట్టీ ముగ్గురన్నా రావడం లేదు.

సౌభా—వీరి కేదీ. యిటు అయిదుమైళ్ళు రోడ్డువెయ్యాలి. ఆసుపత్రిపని వొకటీ పూర్తవలేదు,

రావు—ఆ. రోడ్డు వేస్తున్నారు రోడ్డు; రోడ్డు లేనన్నాళ్ళూ అందరూ వూళ్ళోనే పడివుండేవాళ్లు, యిక రోడ్డు పడితే అందరూ రోజూ పట్నం పరుగెత్తుతారు వూళ్ళోవాకడూ కనుపించడు పలకరించటానికి.

శోభా—అదేమిటి అల్లా అంటారు? రోడ్డు పడితే రవాణా వ్యాపారం ఎక్కువవుతుంది. వ్యాపారం ఎక్కువైతే పది మంది చేతిలో పదిరాళ్ళు ఆడతాయి. దరిద్రం తగ్గుతుంది.

రావు—నిజమేలే, వూరు బాగుపడుతుంది, నిజమే. కాని కాస్త కూర్చుని కబుర్లు చెప్పుకోకుండానా!

[సుబ్బులు Library లోంచి వస్తాడు.]

రావు—నువ్విక్కడే వున్నావేం?

సుబ్బు—ఆ వున్నా. ఏం? అట్లా అడిగారు?

రావు—అహా. ఎవ్వరూ యిటు రాకపోయినా నువ్వన్నా వకసారి వాస్తావనుకున్నా. కాని లోపట్నుంచి వస్తావను కోలేదు.

సుబ్బు—ఆ. రోడ్డుదగ్గరకి వెళ్తూ వచ్చాలెండీ.

[ఈశ్వరం ప్రవేశించి]

ఈశ్వ—సుబ్బులూ. వున్నావా? ఆ. మరి రేపటికన్నా రోడ్డు పని పూర్తి అవుతుందా?

సుబ్బు—పూర్తవుతుందిలెండి. యింకొక్కమైలేగా.

రావు—ఆ, ఆ. పూర్తవుతుంది రోడ్డు, మా తాతలనాటి నించీ అనుకుంటూనేవున్నారు "రోడ్డు కావాలి కావా

లని.'' పూర్తి చేశారు. ఇంకేం వుంది ''కావాలి కావాలి'' అనుకోటానికి?

ఈశ్వ—కావాలంటే చాలా వున్నాయి, కావాలి అనుకోటానికి పెద్ద స్కూలు కావాలనుకోవచ్చు.

రావు—పోండీ. ఆ పెద్దవాళ్ళమీద అభిమానమన్నా లేకుండా పూర్తి చేశేశారు. మూడు నెలల్లో.

సుబ్బు—పూర్తయింది. పురందరిలో పదిమంది బద్ధకించక పోతే ఇంకా మూడురోజులుముందే పూర్తయ్యేది.

రావు—ఆ. ఆ పదిమందిలో నేనూ వొకణ్ణి. అదేగా నువ్వనేదీ.

ఈశ్వ—అబ్బే కాదు. మీరు బద్ధకించరుగా. ఆ చెయ్యి కాలక పోతే, మీరు వూరుకునేవారా? ఆ అమరయ్య పట్నం నించి వచ్చాడా సౌభాగ్యా?

సౌభా—ఇంకా రాలేదండీ!

ఈశ్వ—మొన్ననగా వెళ్ళాడు. యింకారాలేదేం? సిమెంటు బస్తాలకోసం-యివ్వాళ ఆ ఆసుపత్రిపని ఆగిపోతుంది.

[రావు వెళ్ళి చతికిలబడికూర్చుండగా, సుబ్బులుచూసి]

సుబ్బు—అలా చతికిలబడ్డారేం రావుగారూ...

రావు—చతికిలబడక ఏం చెయ్యను? అందరూ పన్లున్నవని పరుగెత్తుతుంటే, నేను చతికిలపడ్తున్నాను.

సుబ్బు—ఫరవాలేదులెండి. మీ బదులు మీ అబ్బాయి పనిలోకి వస్తున్నాడు. ప్రొద్దున్నించీ సాయంకాలందాకా అక్కడే వుంటున్నాడు.

రావు—జాగ్రత్త. వాడి చెయ్యి మంచిదికాదు. రాళ్ళూ రప్పా చేరాస్తాడు.

ఈశ్వ—ఆ. పదసుబ్బులూ; కూర్చుంటే పనులవవు. నేనిటు ఆస్పత్రిదగ్గరకెళ్ళి, పీరయ్యతో మాట్లాడి, రోడ్డుదగ్గరికి వస్తా నువ్వు రోడ్డుదగ్గరికి పద.

సుబ్బు—సరేపదండి, (ఈశ్వరయ్య వెళతాడు)

**శోభా**—నే వచ్చేటప్పటికీ యిప్పటికీ ఎంతభేదం వున్నదండీ వూళ్ళో.

రావు—సరేలే. నువ్వొచ్చేటప్పటకన్నా ఎంతో బాగుపడ్డది. ఇదివరకు ఎక్కడచూసినా మురుగు గుంటలేగా. నువ్వెరుగన్ సుబ్బులూ; రంగయ్య వొదినగారు మురుగ్గుంట లోనేకా పడి ఆత్మహత్య చేసుకుంది?

శోభా—మురుగ్గుంటలోనా?

రావు—ఆ. చెరువులోపల పడటానికి ధైర్యంచాలక మురుగ్గుంట చాలనుకుంది. అప్పుడు మురుగ్గుంటలు చాలాపెద్దవిగా వుండేవిలే.

శోభా—(నవ్వి) ఇప్పుడంతా శుభ్రంగా కాలికి మట్టవకుండా వుంది.

రావు—అప్పటికీ యిప్పటికీ పోలికెక్కడలే. ఇప్పుడంతా ఫ్యాషన్‌లు బలిశాయి; ఎవణ్ణిచూసినా "యిస్త్రీచొక్కాలూ క్రాఫింగులూ"...

సుబ్బు—శుభ్రమైన చొక్కాలు తొడుక్కోటంకూడా ఫ్యాషనేనా?

సౌభా—శుభ్రమైన చొక్కా-లకంటే ముఖ్యం శుభ్రంగా మాట్లాడటం నేర్చుకోవాలి.

రావు—అదిమాత్రం యీవూళ్లో చెయ్య లేవు.

సౌభా—ఇదీచూద్దాం. అన్నివిధాలా అందరూ బాగుపడాల్సిందే. మీలాంటి చదువుకున్నవాళ్ళు మార్గంచూపెడితే అందరూ కాదంటారా? మీరు మొదలకుండా ప్రారంభించితేనే.

[ అర్థోక్తిలో ... ]

రావు—నే చెయ్యనన్నానా – సమయానికి నా చెయ్యి కాలిందిగాని లేకపోతే......

సౌభా—మీరు శ్రద్ధగా చేస్తానంటె, మీరు చెయ్యగలిగింది నే చెప్తాను.

రావు—ఓ తప్పకుండా చేస్తాను. అసలే ఏం తోచక నేనేడుస్తుంటే చెయ్యనంటానా?

సౌభా—సుబ్బులు అటుకోడ్డుపనిమీద, యిటు ఆస్పత్రిపని మీద. తిరుగుతూ, రాత్రి బడిసంగతి చూచుకోలేకుండా వున్నాడు; కూర్చుని చేసేపనేగా. పోసి అది మీరు తీసుకోండి. ఏం సుబ్బులూ?

సుబ్బు—(కొంటెగాచూస్తూ) చిత్తం తమరు అధికార్లు! మీ ఆజ్ఞ కాదనగలనా? (నవ్వుతాడు)

రావు—(సుబ్బులు దగ్గరకెళ్ళి) తేలిగ్గానే వప్పుకున్నావే. మరి రాత్రినించీ పాఠాలు ప్రారంభిస్తాను. వయోజనవిద్య

మీద నువ్వు తెప్పించిన పుస్తకాలన్నీ యిలా ఇయ్యి. చదువుకు మరీ వస్తాను.

సుబ్బు—లోపల అలమారులో వున్నాయి తీసుకోండి.

రావు—ఆ. తీసుకుపోతాను. (Library లోపలికెళ్ళుతాడు)

[వీరయ్య ప్రవేశించి]

వీర—ఈ, ఈశ్వరంగారేరమ్మా ?

సౌభా—నీదగ్గరకే వచ్చారే- యిందాక.

వీర—అక్కడికివచ్చారా ? రాలేదే. ఆసుపత్రికి మూడు కిటికీలే పెట్టమన్నారు. ఆ డాక్టరుగారేమో, నాలుగు కిటికీలు కావాలంటారు.

సౌభా—డెబ్బది రూపాయిలేగా కిటికీలకు కేటాయించింది. నాలుగు కిటికీలు రావు.

వీర—కాని డాక్టర్ గారు "తూర్పువైపున మరో కిటికీ కావాల్సిందే. వెల్తురు చాలదు" అంటున్నారు.

రావు—(రావు లోపల్నుంచి వస్తూ) రాత్రికి రెండు మూడు పాఠాలు చదువుకు వస్తాలే (వెళతాడు)

వీర—ఈయనగారు ఇప్పుడు పాఠాలు చదువుతానంటాడేమిటి ?

సౌభా—రాత్రిబడి పాఠాలు ఇకనించీ ఆయన చెప్తారు.

వీర—ఈయనా ! సౌభాగ్యమ్మా ! నీ పుణ్యం ఏమో గాని సోమారులచేత పని చేయిస్తుండావ్. మరింతకూ ఆ కిటికీల మాటేమిటి ?

సౌభా—నాలుగు కిటికీలు పెట్టటానికి డబ్బుచాలదుమరి.

వీర—నాలుగు కిటికీలు పెట్టకపోతే వెల్తురుచాలదూ!

సౌభా—సక్కొ చెప్పిచూడు డాక్టరుగారితో.

వీర—ఏం చెప్పను? ఎన్ని మాట్లు చెప్పను? ఎవరిమాట వారి దే గాని, వొకరిమాట వొకరికి కాదాయె. పోనియ్యమని పదిరూపాయిలు పారెయ్యగూడదా, కానియ్యమని మూడు కిటికీలే చాలన రాదా, నాకెందుకువచ్చింది, నే నసలు కిటికీలే పెట్టించను.

సౌభా—అందరూ అల్లాకోప్పడితే ఎల్లా వీరయ్య మామా? మనకెందుకని అందరూ వూరుకుంటే ముందుకెట్లాపోతాం?

వీర—(కోపంగా) అదిగో. నువ్వూ నన్నే అంటావ్ - నాకు చిరాకెత్తుకొచ్చిదంటే ఏంచేస్తానో తెల్సా, (కోపంతగ్గించుకొని విసుగ్గా) పోనీ నాకేం? నాలుగు కిటికీలూ పెట్టించేస్తా. దాంతో అందరి రోగం ఆస్పత్రిరోగం కుదురుతుంది.

సౌభా—మరి డబ్బో! పదిరూపాయలుంటే దానికి...

వీర—నీకెందుకు నువ్వాగవమ్మా. పైనపడే పదిరూపాయిలు నావి. రోగంకుదిరిందా?

సౌభా—కుదిరింది.

వీర—వస్తా, (వెళతాడు.)

సౌభా—(సుబ్బులువంక తిరిగి) మీరింకా పనిలోకి వెళ్లలేదేం యివ్వాళ ?

సుబ్బు—వెళతాను. అందరూ యింకావచ్చి వుండరు.

సౌభా—అందరితోపాటు మనకీ వంతా?

సుబ్బు—అబ్బే (నసుగుతూ) ఇక్కడ చల్లగా వుంటేనూ... పోనీ కాసేపు వుందామని వున్నాను.

సౌభా—చెప్పటానికి అంతకంటె కారణం కన్పించలేదా.?

సుబ్బు—వెతక్కుండా కనిపించిన కారణం అదొక్కటే.

సౌభా—మీరు నిన్న మధ్యాహ్నంగూడా ఆలస్యంగానే వెళ్ళారు.

సుబ్బు—పని పూర్తయిపోతోందిగా. తొందరేముంది?

సౌభా—మనమే ఆలస్యంగా వెళ్తే, అందరూ మనకంటే ఆలస్యంగా వస్తారు.

సుబ్బు—నేనుండటం యిష్టంలేకపోతే వెళతాలే (వెళ్ళబోగా)

సౌభా—అదేమిటి? నావుద్దేశ్యం అదికాదు.

సుబ్బు—(ఆగి) అయితే—కాసేపుంటే, ఫరవాలేదుగా.

సౌభా—ఫరవాలేదు. కూర్చోండి (ఆగి ఏదో స్ఫురించగా) నాకొక్క పనుంది; వస్తా.

సుబ్బు—మాట ! (సౌభాగ్య వెళ్ళిపోయింది)

[సుబ్బులు ఏంతోచక అటూ యిటూ చూస్తూ కూర్చుంటాడు. లేచి దర్వాజాదగ్గరకెళ్ళి చూచాడు. నిరాశగా తిరిగివచ్చాడు. దూరంగా వెళ్ళి ఆలోచిస్తూ నుంచున్నాడు. సౌభాగ్య తొంగిచూసింది. సుబ్బులు తిరిగి ద్వారం

వైపు చూశాడు. మళ్ళా తలవంచుకున్నాడు. సౌభాగ్య ద్వారంలోంచి తిరిగి తొంగిచూసింది. సుబ్బులు విసుగ్గా ద్వారందగ్గరకెళ్ళి.]

సుబ్బు—సౌభాగ్యా! నేవెళ్తున్నా.

[వెళ్ళాడు; సౌభాగ్య నిమ్మదిగా బయటకువచ్చి అటే చూస్తూ నిలుచుంది.]

[ఈశ్వరయ్య ప్రవేశము]

ఈశ్వ—ఏమిటమ్మా. ఏమిటో చూస్తూ నుంచున్నావ్.

సౌభా—(ఖంగారుపడ్తూ) సుబ్బులు,. సుబ్బులు...

ఈశ్వ—ఆ. సుబ్బులు? ఏమిటీ?

సౌభా—ఏంలే. యిప్పుడే పనిలోకి వెళ్ళాడు.

ఈశ్వ—పనిలోకి, యిప్పుడు వెళ్ళాడా? యింతసేపూ ఏం చేస్తున్నాడు?

సౌభా—ఏవో కబుర్లు చెపుతూ కూర్చున్నాడు. యిప్పుడే వెళ్ళాడు.

ఈశ్వ—(నవ్వి) ఊఁ. సరేలే. నేనూ వెళ్ళాలి. యింతవరకూ యిక్కడే సరిపోయింది.

[వెళ్ళబోతుండగా ప్రెసిడెంటు ప్రవేశించి]

ప్రెసి—ఈశ్వరయ్యగారూ! మీకోసమే వచ్చాను.

ఈశ్వ—ఏం, ఎందుకూ?

ప్రెసి—మరేంలేదు, యివ్వాళ నేను పనిలోకి రాలేనండీ.

ఈశ్వ—రాకపోతే ఎట్లా? వక్కడు రాకపోయినా వారివంతు పని ఆగిపోతుంది.

ప్రెసి—నిజమే ననుకోండి. కాని నేను రాలేను; కావాలంటే నావంతు పనికి కూలివాణ్ణి వేసుకోండి. డబ్బు నేనిస్తాను.

ఈశ్వ—కూలివాణ్ణి కుదుర్చుకోమంటారా!

ప్రెసి—ఆ.

ఈశ్వ—సరే. మీవంతుపనికి నలుగురు కూలీలను పంపండి.

ప్రెసి—నన్ను పంపమంటారా?

ఈశ్వ—మరి, నన్ను తెచ్చుకోమంటారా?

ప్రెసి—వూళ్ళో అందరూ అక్కడే పనిచేస్తున్నారు. నాకెక్కడ దొరుకుతారు-కూలీవాళ్లు-అందులో నలుగురూ,

ఈశ్వ—నాకుమాత్రం ఎక్కడ దొరుకుతారు?

ప్రెసి—బలే చిక్కులో పెట్టారే.

ఈశ్వ—చిక్కులో నేనేం పెట్టాను. మీరే వూరిని చిక్కుల్లో పెడుతున్నారు. మీ శరీరశ్రమకు విలువకట్టి డబ్బిస్తానంటారు. శరీరశ్రమకూ, డబ్బుకు సాటా; మీరెంత డబ్బిచ్చినా, మీరుచేసిన పని విలువ వూరికిరాదు. ఇది మానవసేవ. మానవసేవకు విలువకట్టి మనం మనల్నే నీచంగా చూసుకోవటం, ఏం బాగాలేదు.

ప్రెసి—మళ్లా మాట్లాడకుండా చీవాట్లు వేశారే. సరేలెండి నేనేవస్తాను. ఆ-మరేంలేదు. ఇవ్వాళ మాబావమరిది వచ్చాడు; వాడితో కాసేపు సరదాగా మాట్లాడుతూ కూర్చుందామనుకున్నాను.

ఈశ్వ—అలాగా? అయితే-మీ బావమరిదికూడా వచ్చి పని చేస్తే వూరంతా చాలా సంతోషిస్తామని చెప్పండి.

ప్రెసి—వాడా? వాడెక్కడవస్తాడండీ? వాడు చాలా మోతుబరి రైతు.

ఈశ్వ— మోతుబరి రైతంటే - సోమరిపోతు కాదుగదా (సౌభాగ్యవంక తిరిగి) సౌభాగ్యమ్మా అమరయ్య యింకా రాలేదుగా ?

సౌభా—రాలేదల్లేవుంది.

ఈశ్వ—ఇంకా సేపూ ఏం చేస్తున్నాడో. మొన్ననగా వెళ్లాడు పట్నం.

ప్రెసి—ఏం చేస్తాడూ సిమెంటుకనీ, కలపకనీ బస్తీకిపోయి నాటకాలు, సినిమాలూ చూస్తూ కూర్చుంటాడు.

ఈశ్వ—ఏమంటారు. ?

ప్రెసి—ఇది నేనటం కాదులెండి. లోకులంటున్నారు. లేకపోతే నాకుమాత్రం ఏం తెలుసు?

ఈశ్వ—అయితే యిది నిజమే నంటారా ?

ప్రెసి—నిజమో కల్పనో, తేల్చాల్సింది. మీరు- వూరంతకీ నాయకులు. మీరు కళ్లు మూసుకుంటే_ మా దేముంది ? మేమూ కళ్లు మూసుకుంటాం.

ఈశ్వ—ఊఁ; కాను; ఈ వాదు నిజమైనా, అబద్ధమైనా వూరుకోవాల్సింది కాదు; ఇవ్వాళ అమరయ్యని రేపు మరొకర్ని అనుమానిస్తారు. దీని సంగతి యివ్వాళ తేలుద్దాం.

సౌభా—నిజమేగాని, యిదీ ఆలోచించండి. ఈ అనుమానాలు విచారణలూ, యిప్పుడు సాగిస్తే, అనుకున్న ప్రకారం పని సాగదు. యిప్పుడేం తొందర పడకండి. అన్నీ చివరకి ఆలోచిద్దాం.

ప్రెసి—నిజమేనండోయ్; అదీ ఆలోచించాల్సిందే.

ఈశ్వ—కాదు, వుద్యమంలో కుళ్లు బయలుదేరింది; ఇప్పుడే దీన్ని కత్తిరించేయకపోతే, వుద్యమాన్నే నాశనం చేసేస్తుంది. దీన్ని యీపూటే తేల్చేస్తాను.

సౌభా—వద్దు, తొందరేం లేదు. నామాట వినండి.

ప్రెసి—అడిగో అమరయ్య వస్తున్నాడు.!

సౌభా—అన్నీ తర్వాత మాట్లాడొచ్చు. యిప్పుడేం తొందర పడకండి ఈశ్వరయ్యగారూ!

ప్రెసి—అవును. వూరినుంచి రాంగానే యీసంగతు లడిగితే యెవరికైనా చిరాకొస్తుంది.

[అమరయ్య ప్రవేశం]

అమ—వున్నారా! సిమెంటు బస్తాలొచ్చాయండీ. మనో ఏభై బస్తాలు ఎక్కువే లాక్కొచ్చాను.

ఈశ్వ—చాలా సంతోషం. కాని, మీరు నిన్న సాయంకాలానికే వస్తారనుకున్నాం.

అమ—రావటానికి వీల్లేక పోయిందిలెండి.

ఈశ్వ—ఎందుకు రావటానికి వీల్లేకపోయిందీ. అడగవచ్చా?

ప్రెసి—ఈశ్వరంగారూ.

అమ—ఎందుకంటారేమిటి ? వెళ్ళిన పని కావద్దూ ?

ఈశ్వ—పనికాకే ఆగానంటారా?

అమ—మీరనేది నాకర్థం కావటంలేదు. పనైతే నేనెందుకు ఆగుతాను ?

ఈశ్వ—ఏమో ! సినిమాలకో- నాటకాలకో.

సాభా }
ప్రెసి } —ఊరుకోండి మీరు ఈశ్వరయ్యగారూ.

అమ—అయితే సినిమాలకోసం, నాటకాలకోసం, నేను పట్నంలో ఆగుతున్నాననా ?.

ఈశ్వ—అలా అని నేను విన్నాను.

ప్రెసి—అబ్బ, ఈశ్వరయ్యగారూ! నా మాటవినండి.

అమ—అయితే యిక నన్నెక్కడికి పంపకండి. ఊరికివెళ్ళి వాళ్ళ కాళ్ళూ వీళ్ళ కాళ్ళూ పట్టుకునేకంటే, వూళ్ళోనే కూర్చుని, పనిచేసుకోటం తేలికే, యికనించీ మీయిష్ట మయిన వారిని నమ్మకస్థుల్ని పంపుకోండి.

ప్రెసి—అమరయ్యా, నువ్వన్నా వూరుకో.

అమ—ఎందుకూరుకోవాలి? తినికూర్చోక యిలా నీలాపనిందలు నెత్తినవేసుకోవటం యెందుకు? వందబస్తాల సిమెంటు బళ్ళమీద వస్తోంది, యిదిగో మీబిల్లు; బిల్లుమీద దమ్మిడీ నేను ఖర్చుచేయలేదు. తీసుకోండి. యిక సెలవు. (వెళతాడు)

ప్రెసి—ఈశ్వరంగారూ, వెళ్ళిపోతున్నాడండీ అతను.

సౌభా—ఏముంది? యిలా నాతో కబుర్లు చెప్పటమేగా!

సుబ్బు—ఇదిమాత్రం మంచి పని కాదా?

సౌభా—బాగా నేవుంది. యిప్పుడు యీశ్వరయ్యగారొచ్చి యిక్కడేం చేస్తున్నారంటే యేం చెప్తారు?

సుబ్బు—"పనిమీదే వచ్చాను; యిక్కడ తప్పసరి పని వకటుంది" అంటాను.

సౌభా—"ఏమిటో ఆ పని చెపవచ్చా" అంటారు?

సుబ్బు—"మీకు చెప్పనక్కరలేదు" అంటాను.

సౌభా—సుబ్బులూ, "నువ్వొక సోమరివై పోతున్నావ్" అంటారు.

సుబ్బు—అనరు.

సౌభా—అంటారు.

సుబ్బు—అనరు.

[అలా రెట్టించుకుంటూ వుండగా ఈశ్వరయ్య ప్రవేశించి]

ఈశ్వ—అంటాను.

సుబ్బు—(తెల్లబోయి) ఏమంటారు?

ఈశ్వ—పనిమానేసి యిక్కడికెందుకు వచ్చావంటాను?

సుబ్బు—పనిచేస్తుంటే కాలు తెగింది. మందుకోసం వచ్చానండీ. (కాలిమీద గాయము చూపిస్తాడు)

ఈశ్వ—ఆ. కాలు తెగిందా? అరే!!!

సౌభా—అయ్యో! మొండితనమా! చెప్పరేం యిందాకణ్ణించీ? ఆగండి మందు తెస్తాను.

(సౌభాగ్య గబగబా లోపలికి వెళ్ళి దూది పుల్లటించర్ తెస్తుంది)

ఈశ్వ— బాగా తెగిందే!

సుబ్బ—మున్ను తప్పేతుంటేనూ, పార తగిలింది.

సౌభా—చేతకాని పారపనికి పోవటమెందుకూ. అసలు పనిలో పడితే వళ్ళు తెలియదు. అంత కళ్ళుమూసుకు పని చెయ్యడమెందుకూ ?

సుబ్బ—నేను కళ్ళు తెరచుకునే పనిచేస్తున్నాను; ఆ పారే కాలికి తగిలింది. ఆపారకు కళ్ళులేవుగా.

సౌభా—బాగానే వుంది. పట్టండి మందు.

సుబ్బ—అదా! ఆ టించర్ కు మంటపుడుతుంది.

సౌభా—మంట పుట్టినా చీము పట్టదు.

(గాయంమీద రాస్తుంది)

సుబ్బ—(బాధతో) అబ్బా,

సౌభా—బాగా మంట పుట్టిందా బాగా; మరీ చిక్కగా వుంది టింక్చర్.

ఈశ్వ—ఆ, ఎంత చిక్కగావుందిలే, మెత్తని మసనుగనక అల్లా అనిపిస్తుంది.

సౌభా—ఇంకాస్త రాయనా! చీమూ గీమూ పట్టదు.

సుబ్బ—రాస్తావా ?!!

సౌభా—పోనీ వద్దులే. మంటపుడ్తుందేమో. ఇక యివ్వాల్టికి ఆ పాడు పనిలోకి వెళ్ళకండి.

ఈశ్వ—పనిలోకి వెళ్ళనద్దంటావా ?
సౌభా—ఆ. ఆ కాలితో ఏం పనిచేస్తారూ ?
ఈశ్వ—ఏమయ్యా, వెళ్ళి పనిచేయలేవ్రా ?
సుబ్బు—అహ ! చెయ్యగలను లెండి.
ఈశ్వ—అయితే వెళ్ళు.
సుబ్బు—వెళ్తున్నా. వస్తాను సౌభాగ్యా.
సౌభా—ఆ. (సుబ్బులు వెళ్లగా అటేచూస్తూ నుంచుంటుంది.)
ఈశ్వ—నన్ను తిట్టుకుంటున్నావా సౌభాగ్యా!
సౌభా—మిమ్మల్ని తిట్టుకోవటం ఎందుకూ.
ఈశ్వ—అతన్ని పనిలోకి పంపానని,...
సౌభా—లేదు, అబ్బే!...
ఈశ్వ—వస్తా. ప్రొద్దున్నించీ గోడ్డుదగ్గరకి వెళ్ళనేలేదు. (వెళతాడు)

[ సౌభాగ్య ఆలోచిస్తూ కూర్చుంటుంది. వీరయ్యప్రవేశము ]

వీర—సీమెంటు వచ్చిందమ్మా. వండబస్తాలొచ్చింది.
సౌభా—ఈశ్వరయ్యగారు వెళ్లమంటే, సుబ్బులు పనిలోకి వెళ్ళాడు,
వీర—అహా, పోనీ వెళ్లనీ; ఆ సీమెంటు యెక్కడ దింపించమంటావ్.
సౌభా—సీమెంటు సంగ తర్వాతవుంచులే,! పాపం అతని కాలు తెగింది.

వీర—పాపం! ఎందుచేత తెగింది.

సౌభా—ఆ - పారకు కళ్లు లేవుగాదూ.

వీర—పారకు కళ్ళా! ఏమిటమ్మా. అలామాట్లాడుతుండావ్. మనసు మనసులో లేనట్టుందే?

సౌభా—(పరధ్యానంలోంచి తేరుకొని) నిజమే వీరయ్య మామా. తర్వాత మాట్లాడదాంలే. (లోపలికి వెళ్ళు తుండగా)

[ రావు ప్రవేశించి ]

రావు—సుబ్బులేడమ్మా? సుబ్బు లేడీ.

సౌభా—(కంగారుపడి) ఏం యేమయింది సుబ్బులుకి..!!

రావు—ఏమవలే. యిక్కడొక సందేహమువచ్చింది, యీ పాఠం వయోవృద్ధులికి అర్థం అవుతుందా అని (పుస్తకం చూపించబోతాడు)

సౌభా—అంతేకదా! అసలే అతని కాలు తెగింది.

రావు—తెగితే తెగిందికాని యిక్కడ యీ పాఠంలో ...

సౌభా—ఏమో, పాఠాలసంగతి తరువాత చూసుకుందాం లెండి. పాఠాలసంగతికేమొచ్చె. (లోపలికి వెళ్ళినది)

రావు—అదేమిటి అతనికాలు తెగితే యీమెకంత బాధెందుకూ!

వీర—అదా? ఏముంది ... ... ... ఏం లేదులెండి.

రావు—ఏం లేదంటావా?

వీర—ఏమన్నావుందా? అయితే, ఏదో వోమాదిరిగా వుంది లెండి యివ్వాళ.

రావు—ఇవ్వాళేం ? నేను నిన్ననే కనిపెట్టా, ఆదోమాదిరి

వీర—అహా. నేను మొన్న కాస్త మరోమాదిరిగా చూశా లెండి.

రావు—మాదిరి యేముందిలే. చివరకన్ని మాదిర్లు వక్క మాదిరిగానే మారిపోతాయి.

వీర—అవునుగాని, యీమాదిరి నేనెక్కడా చూడలే ?

రావు—ఎక్కడా చూడలా! నేను చాలాచోట్ల చూశాను.

వీర—అహ, యీమాదిరి మీకెక్కడ దొరుకుద్ది లెండి, యిది బలే మాదిరి, మొన్న లైబ్రరీలోపల కూచ్చుని. బలేగా నవ్వుకుంటున్నారు. (రహస్యం చెప్పినట్టు అంటాడు)

రావు—నిన్న సాయంత్రం పసిమానేసి సుబ్బులు మూడు సార్లు మంచినీళ్ళకు వచ్చాడు.

వీర—రాత్రి అమ్మాయి కలవరిస్తూంది "సుబ్బులూ" అని

రావు—అహా! "సుబ్బులూ" అని ఏడుస్తూ కలవరించిందా? నవ్వుతూ కలవరించిందా ?

వీర—(ఆలోచిస్తూ) మొదటిసారి నవ్విందిగాని, రెండోసారి కాస్త యేడ్చినట్టే అంది.

రావు—అరే! యీమాదిరి నేనెక్కడా చూడలేదే !!!

వీర—మొన్న సుబ్బులు కిష్టం అని కొబ్బరిలౌజులు పొట్లాం కట్టి తెచ్చింది యింట్లోంచి.

రావు—కొబ్బరిలౌజులేనా! మాఆవిడకు కళ తిరిగితే కొబ్బరి లౌజులే చేస్తుంది.

వీర—ఇంకెందుకు? సంగతి తేలిపోయిందిగా, తేలిపోయింది.

రావు—సంగతి నిన్న సాయంకాలమే తేలిపోయింది.

వీర—ఇక తేల్చాల్సింది వక్కటే.

రావు—ఏమిటది?

వీర—పెళ్ళిముహూర్తం (నవ్వి) పెళ్ళికి నేను కొబ్బరిబొండాలు దాచివుంచుతా.

రావు—నేను పంచరత్నాలు రాయిస్తా.

వీర—ఈమాట యీశ్వరయ్యగారికి తెలుసా?

రావు—ఇంకా తెలిసి వుండదు.

వీర—రాత్రికి నే చెప్తాలెండి.

రావు—సాయంకాలం నే చెప్తాలే.

వీర—అహా, అయితే- నేనిప్పుడే వెళ్ళి చెప్పొస్తా.

[సౌభాగ్య బయటకి వచ్చి]

సౌభా—ఏమిటి వీరయ్యమామా! యీశ్వరయ్యగారితో చెప్తా నంటున్నావేమిటి?

వీర—(ఖంగారుపడ్తూ) అదేనమ్మా అదే. అదే పెళ్ళిసంగతి,

సౌభా—పెళ్ళా. ఎవరిది?

వీర—అదే రావుగారి ... ...

సౌభా—రావుగారిదా యింకో ... యింకో ...

రావు—అబ్బేనాది కాదు, నాకింకో పెళ్ళికూడానా?

వీర—అబ్బే! మీ అబ్బాయిదయ్యా! (నవ్వుతాడు)

శోభా—వారి అబ్బాయికి యిప్పుడేం పెళ్ళి? ...

వీర—ఇప్పుడల్లాకాదులే; తొందరలో, అంటే అదే యీ డొచ్చాక.

[ ఈశ్వరయ్య అమరయ్య వస్తారు ]

అమ—ఇడుగో వీరయ్యమామ యిక్కడేవున్నాడు. ఏం మామా మరి నీ ఆస్పత్రి యెప్పట్లో పూర్తిచేస్తావ్.

వీర—అరె తస్సదియ్య! ఆసిమెంటు బస్తాలు కిందకుదింప లేదు. పని పూర్తి చెయ్యాలంట.

ఈశ్వ—అవుతే మారోడ్డే పూర్తవుతుంది, ముందర.

వీర—సిమెంటు బస్తాలయ్యోయ్ అని మొత్తుకుంటే మొన్నటిదాకా మెదలకుండా వున్నారు. యెంతసేపూ మీ రోడ్డుకి మట్టి, మీరోడ్డుకి రాయి సంగతేగాని నామొర విన్నారూ!

అమ—లేకపోతే ఆస్పత్రి కేం తొందరేం? ఆ డాక్టర్‌గారు వకటే మాటన్నారు వినలే "ఈవూరికింత హాస్పిటలెందుకు? యిప్పుడసలు కేసులే రావటంలె" అని.

రావు—మరి మురుకాలవలూ పెంటకుప్పలు పోయింతర్వాత వూళ్ళో రోగాలే తగ్గాయిగా మరి.

ఈశ్వ—మనం యేకుటీరపరిశ్రమో...మనవూళ్ళో ప్రారంభించాలి.

వీర—కుటీరమా? కుటీరం అంటే.

అమ——అంటే-మనింట్లో మనంకూర్చుని, తీరిక వేళ ఏదో పని చేసి డబ్బు సంపాదించటం.

వీర——అంటే మనఆడవాళ్ళు మొగాడికి తెలీకుండా నెయ్యమిన్నా వెన్నమిన్నా డబ్బు సంపాదిస్తే అదీ కుటీరపరిశ్రమేనా ?

ఈశ్వ——ఆ, వూరికే కూర్చోకుండా, అనేకం చెయ్యవచ్చు. దేశానికీ వుపయోగం మనకీ వుపయోగం.

వీర——దేశానికేం వుపయోగం? యింట్లో ఆడది నెయ్యమ్మి సొమ్ముచేస్తే, యింట్లో మొగాడికే వుపయోగం దక్కదే, అల్లాంటిది, దేశానికేం వుపయోగం. ?

ఈశ్వ——ఏంలే! నువ్వింట్లో కూర్చుని, గజం ఖద్దరు నేశావనుకో దేశానికి గజం ఖద్దరు ఆదాఅయిందా? అలా నలభైకోట్ల మంది, నలభైకోట్లగజాల ఖద్దరు నేస్తే దేశంలో గుడ్డకరువు తీరదూ, దేశం భాగ్యవంతం కావాలంటే డబ్బక్కర్లే, వస్తువులు మనం తయారుచేస్తే అదే డబ్బు.

వీర——అదా తికమక ! తస్సదియ్య ! గాంధీగారు ఖద్దర్ ఖద్దరని వూరికే మొత్తుకోలేదన్నమాట.

ఈశ్వ——ఖద్దరొక్కటేకాదు. యిలాంటివి యెన్నో వున్నాయ్. చేతికర్రలదగ్గర్నించీ. జరీ పనివరకూ కుటీరపరిశ్రమలుగా మార్చవచ్చు.

అమ——ఈరోడ్డుపని అయిపోంగానే. అల్లాంటివి వొకటో రెంటో గ్రామంలో ప్రారంభిద్దాంలెండి.

వీర——ఈపనులయాక మరోపని వుందండోయ్. దాని కందరం పూనుకోవాలి.

ఈశ్వ—ఏమిటది ?

వీర—వుంది లెండి, లేదటండీ రావుగారూ. (నవ్వుతాడు)

రావు—వుంది లెండి.

ఈశ్వ—ఏదో పెద్దపని తలపెట్టినట్టున్నారు.

వీర—పెద్దపనే ! పెళ్ళిపని.

అమ—పెళ్లా ! ఎవరిది ?

వీర—మందే...అదే... మనందరం కల్సి చెయ్యాల్లే.

(సౌభాగ్యవంక చూస్తాడు)

సౌభా—ఎవరిది ?

వీర—(సౌభాగ్యవంకే చూస్తూ) ఎవరిదో అయితే నాకేం తొందర? మా అమ్మాయిదే. (సౌభాగ్య వంక చూచి నవ్వును)

(నవ్వుతారు)

అమ—ఓ ఓ చేద్దాం. (సౌభాగ్య సిగ్గభినయిస్తుంది)

ఈశ్వ—ఆ, అన్నిపనులూ నెమ్మదిగా ఆలోచిద్దాం. సుబ్బులు కనిపించాడా అమ్మా ?

సౌభా—రోడ్డు దగ్గరి కెళ్ళాడేమో !

ఈశ్వ—అక్కడా లేడేం యెక్కడ తిరుగుతున్నాడో! రెండు రోజులబట్టీ అదో మాదిరీగా వున్నాడు; వీరయ్యా ! ఆస్పత్రికి వెళ్ళివద్దాంరా. డాక్టరుగారితో మాట్లాడదాం యీలోగా సుబ్బులు యిక్కడికివస్తాడు. రా అమరయ్యా !

వీర—ఆ, పదండి. (సౌభాగ్యతప్ప అందరూ వెళ్తారు)

[కాసేపయిన తరువాత సుబ్బులు ప్రవేశించి]

సుబ్బు—సౌభాగ్యా !

సౌభా—(వచ్చి) వచ్చారా ?

సుబ్బు—ఏం. ఏమన్నా పనుందా ?

సౌభా—లేదు.

సుబ్బు—ఏం లేదు గదా. అహా, "వచ్చారా" అని నాకోసం కాచుక్కూచున్నట్లు అడిగితేనూ.

సౌభా—కాచుక్కూచోలేదు. కాని వస్తారని నాకు తెలుసు.

సుబ్బు—ఎట్లా తెలుసు ! కలగన్నావా ?

సౌభా—పగటిపూట కలలు ఎవరుకంటారూ ? ఎవరో మీబోటివాళ్ళుతప్ప.

సుబ్బు—నువ్వు నాబోటి దానవుకాదా ఏమిటి ?

సౌభా—ఎట్లా అవుతాను ? నేనేం పనిమానుకు తిరుగుతున్నానా ?

సుబ్బు—అయితే- నేను పనిమానేసి తిరుగుతున్నానంటావా? సిమెంటుబస్తాలొచ్చాయో, రాలేదో, కనుక్కుందామని వచ్చానుగాని ... ... ...

సౌభా—సిమెంటుబస్తాలు స్కూలు దగ్గరుంటాయి. యిక్కడెందుకు వుంటాయి?

సుబ్బు—ఇక్కడ నువ్వుంటావుగా; నిన్ను కనుక్కుంటే తెలుస్తుందని వచ్చాను.

సౌభా—ఆ, ఆ, మనసంగతి అందరికి తెల్సింది మనకి తప్ప; దయచేసి యిహ యిక్కడికి రాకండి: బాగుండదు.

సుబ్బు—నీకంత బాగుండకపోతే రానులే.

సౌభా—నాకు బాగుండకపోవడమేమిటి ?

సుబ్బు—అయితే బాగుంటుందా ?

సౌభా—బాగానే వుంది పెడర్థాలు.

[అమరయ్య ఈశ్వరయ్య ప్రవేశము]

ఈశ్వ—ఓ, నువ్విక్కడ వున్నావా? నీ కోసం వూరంతా వెతుకుతున్నాం.

సుబ్బు—(ఖంగారుపడ్తూ) ఊ...ఊ...వచ్చానండీ యిప్పుడే (అర్థోక్తిలో)

సౌభా—దాహమయితేనూ వచ్చాడండీ,

ఈశ్వ—దాహమయిందా ?

అమ—(వ్యంగంగా) ఈమధ్య మన సుబ్బులికి దాహంబాగా యెక్కువైందండీ.

ఈశ్వ—దాహమయితే మంచినీళ్ళు వూళ్ళో యెక్కడా దొరకలే? యిక్కడిదాకా రావాలా ?

అమ—ఇక్కడి నీళ్ళు బాగాతీపండీ, అందుకని వచ్చాడు.

ఈశ్వ—దాహమేసి అతను వస్తే తొందరగా మంచినీళ్ళు - యిచ్చిపంపకపోయినావా సౌభాగ్యా! కబుర్లు చెపుతూ కూర్చోపెట్టావేం?

సౌభా—ఇస్తానంటున్నాను. మీరువచ్చేశారింతలో, యిస్తానుండండి. (వెళ్ళుతుంది)

ఈశ్వ—(సుబ్బులువంకకు చూస్తూ) సుబ్బులు కాస్త నలిగినట్లు కనిపిస్తాడేం, అమరయ్యా ?

అమ—ఈమధ్య కాస్త అల్లాగే వున్నాడులెండి; సరిగ్గా నిద్రలేక.

ఈశ్వ—నువ్వు డాక్టరుగారిదగ్గరకెళ్ళి పరీక్షచేయించుకో సుబ్బులూ! నిద్దరకాయటం, మంచినీళ్ళు త్రాగటం, యీ లక్షణాలు యేం బాగాలేవు.

సుబ్బు—లేదండీ. నాకు బాగానే వుందే.

ఈశ్వ—ఆ. నీవయసులో అంతా బాగానే వుంటుంది. నా మాటవిని, మందో, మాకో అడిగితీసుకో.

అమ—వేరే మందులెందుకండీ, నాదగ్గరో చిన్న చిట్కా వుంది. అది యీాగోడ్డుపని అవంగానే యిస్తా తీసుకో వయ్యా.

[ సౌభాగ్య మంచినీళ్లుతెచ్చి యిస్తుంది ]

సుబ్బు—యింకా కాసిని కావాలి.

సౌభా—అరే. అయిపోయినాయే ?

ఈశ్వ—అహ. కూజాడునీళ్ళు అయిపోయాయా, అప్పుడే ప్రొద్దున్నగా నీళ్ళు పోశారూ.

సౌభా—నేనూ కాసిని తాగానులెండి. బాగాదాహం వేస్తుం టేనూ.

ఈశ్వ—వీళ్ళిద్దరికీ దాహం యెక్కువేనయ్యోఁయ్ !

అమ—నేవెళ్ళి మాయింట్లోంచి రెండు బిందెల నీళ్ళు పంపిస్తా నాగండి !

సౌభా—వక్క బిందె చాలండీ.

అమ—ఫరవాలేదులే, అమ్మా (వెళతాడు)

ఈశ్వ—(ఏదోజ్ఞాపకం వచ్చి) ఇదిగో అమరయ్యా! నేనూ వస్తున్నాను. ఆగు (ఈశ్వరయ్య! వెళ్ళును)

సౌభా—(సుబ్బులుతో) చూశారా వాళ్ళమాటలు? యెలా మాట్లాడుతున్నారో!

సుబ్బ—నిజంగా మంచినీళ్లు తెస్తారేమో! మళ్ళా మరో మరోగ్లాసు తాగాలి.

సౌభా—ఓ గ్లాసు తాగితే ఎల్లా? అంతా దాహమని చెప్పి

సుబ్బ—నేచెప్పానా దాహమని? నువ్వే అన్నావు.

సౌభా—మరి నువ్వు మెదలకుండా వూరుకుంటే, యేదో కారణం నేను చెప్పాను.

సుబ్బ—ఏదైనా మరొకటి చెప్పాలిగాని, యిదా?

సౌభా—చాల్లెండి. తొందరగా రెండు గ్లాసుల మంచినీళ్లు త్రాగి వెళ్ళండి బాగుండదు.

సుబ్బ—మంచినీళ్ళు నువ్వూ తాగాలి, బాగా దాహంగా వుందన్నావ్. యింకాక (తెరలోకి కొరకొరా చూస్తూ) మనిద్దరిచేత మంచినీళ్లు త్రాగించందే వదలరల్లేవుంది.

సౌభా—ఆరి భగవంతుడా! బిందెడు నీళ్ళు తెస్తున్నాడు.

సుబ్బ—నేనిక నీళ్ళు తాగలేను. వెళ్ళిపోతాను.

సౌభా—దాహమని చెప్పి వెళ్ళిపోతే నేనేం చెప్పను వాళ్ళకి.

సుబ్బ—వుండి మంచినీళ్ళు యెట్లాత్రాగను? ఆవలిస్తే పైకి నీళ్ళు వస్తూన్నై.

సౌభా—వచ్చేశారు, మాట్లాడకండి.

(గబగబా వెళ్ళి యెవరికి వారు దూరదూరంగా కూర్చుంటారు)

[ఈశ్వరయ్య ప్రవేశించి]

ఈశ్వ—సౌభాగ్యా! వక్కసారి వెళ్ళి, వీరయ్యను పిల్చుకు రా అమ్మా.

సుబ్బు—నే వెళతాలెండి.

ఈశ్వ—అహా, నీతో నేను మాట్లాడాలి.

సౌభా—ఎందుకూ. నే వెళ్ళొస్తాలెండి (వెళుతుంది.)

ఈశ్వ—బాగా దాహం అవుతున్నట్టుందే, నీ మొహం చూస్తే.

సుబ్బు—లేదు లెండి. అంతగా లేదు.

ఈశ్వ—చూడు సుబ్బులూ! నీకు యిరవై రెండేళ్లు. తప్పులు చేయకూడని వయసు దాటలేదు గనకా నువ్వూ కొన్ని తప్పులు చేస్తుంటావు, అప్పుడప్పుడూ.

సుబ్బు—అట్లా అన్నారేం?

ఈశ్వ—తప్పు చేశావని నేనంటే నీకోపం రావచ్చు.

సుబ్బు—తప్పు చేసినప్పుడు, చేశావంటే కోపం యెందుకూ?

ఈశ్వ—ఎందుకంటే. నేతప్పనుకున్నది. "తప్పు"అని నువ్వూ అనుకోవాలిగా; నా వయస్సులో తప్పుగా కనిపించేది, నీవయస్సులో అనిపించకపోవచ్చు.

సుబ్బు—అట్లా యెల్లా? తప్పనేది వయసునుపట్టి మారుతుందా?

ఈశ్వ——తప్పు వయస్సును బట్టిగాదు; సమయాన్ని బట్టీ పరిస్థితులను బట్టీ కూడా మారుతుంది; దాహం కాక పోయినా, మంచినీళ్ళు తాగడం తప్పు కాదూ ? చెప్పు.

సుబ్బు——కాని ... ... నాకు ...

ఈశ్వ——అసంగతికాదు నేననేది; నీవయస్సులో పెళ్ళి చేసుకోవటం తప్పుకాదు; నీకు నచ్చినవారిని నువ్వు చేసుకుంటావనుకో. కాని ''పెళ్ళి చేసుకుంటాగదా'' అని, అన్ని పనులూ మానేసి, అదేపనిగా అమ్మాయితో కబుర్లు చెప్తుతూ కూచోటం-కూడా తప్పే- నాబోటివాళ్ళకి; నీ బోటివాళ్ళకి బాగానే వుంటుందనుకో,-

[అమరయ్య బిందెతో మంచినీళ్లు తెస్తాడు]

ఈశ్వ——దాహంగా వుంటే పోనీ - కాసిని మంచినీళ్లో త్రాగిరా !

సుబ్బు——ఆ. వస్తా (వెళ్ళి మంచినీళ్ళు త్రాగొచ్చి) నేను వెళుతున్నానండీ. రోడ్డు దగ్గరుంటాను.

ఈశ్వ——తొందరపడకు ? మరేం గాబరా లేదు; నెమ్మదిగా వెళ్లు. (సుబ్బులు వెళ్లాడు.)

అమ——(దగ్గరకొచ్చి రహస్యంగా] ఏమన్నారేం ?

ఈశ్వ——పెళ్ళి చేసుకోవద్దనలే.

అమ——అమ్మాయి యేదీ ?

ఈశ్వ——వీరయ్య దగ్గరకెళ్ళింది. వీరయ్య లేడంటూ తిరిగి వస్తుందిలే.

అమ—అదేమిటీ ?

ఈశ్వ—వీరయ్య ఆస్పత్రిదగ్గర లేడు. కాని సుబ్బులుతో వంటరిగా మాట్లాడాలనీ, అమ్మాయిని అటు పంపా. వెళ్ళి చూసి లేడని తిరిగి వస్తుంది.

[ సౌభాగ్య ప్రవేశము ]

సౌభా—వీరయ్య లేడండీ అక్కడ.

ఈశ్వ—అహా! పోనీ లే. సుబ్బులు మంచినీళ్ళు త్రాగి వెళ్లాడు. కావాలంటే నువ్వూ తాగిరా!.

సౌభా—అక్కర లేదండీ.

ఈశ్వ—నువ్వుకని పెట్టావో లేదోగాని, నాలుగయిదు రోజుల బట్టీ సుబ్బులు అదోమాదిరిగా వుంటున్నాడు సౌభాగ్య!

సౌభా—ఏం ? యెలావుంటున్నాడు ?

ఈశ్వ—సాధారణంగా, అనుకున్న పని కాకపోయినా, కోరిన పెళ్ళి కాకపోయినా కుర్రవాళ్ళు యెలావుంటారో అతనూ అలాగే వున్నాడు.

సౌభా—అహా.

ఈశ్వ—అతను కోరుకుంటే పెళ్ళి కాకపోదు; మరెందువల్ల అలావుంటున్నాడో! నీకేమన్నా తెలుసమ్మా ?

సౌభా—నాకేం తెలియదు (సిగ్గు అభినయించి తలవంచుకుంటుంది)

ఈశ్వ—(నవ్వి) మీయిద్దరూ పెళ్ళిచేసుకుంటే మాకెవ్వరికి అభ్యంతరం లేదు. కాని, మీరిద్దరూ ప్రేమప్రసంగాల్లోపడి పూరిపనులు వెనక్కినెట్టటం మాత్రం బాగాలేదు.

సౌభా—ఇప్పుడు వూరిపనులు యెవరుచేయటంలేదు ?

ఈశ్వ—సుబ్బులే చేయటంలేదు. మాటమాట్లాడితే యిక్కడికి పరుగెత్తుకురావటం, పనిలోకూడా పరధ్యానంగా పార కాలిమీద వేసుకోవటం యివ్వన్నీ యేమిటంటావ్.

సౌభా—(విచారంగా తలవంచుకుంటుంది)

ఈశ్వ—మహత్తరమైన కార్యం వొకటి తలపెట్టాం. దీన్ని మధ్యలోనే వదిలెయ్యటం బాగుండదు. కనుక మీరిద్దరూ త్వరలో పెళ్ళిచేసుకున్నా సరే, పెళ్ళిసంగతి యిప్పుడప్పుడే తలపెట్టకపోయినా సరే. నీవల్ల అతని మనస్సు చెదరిపోతోంది, యెంతో ఆదర్శప్రాయంగా వుండేవాడు, ఆ మాటే మరచిపోతున్నాడు. వంటి సంగతి పట్టించుకోకుండా యిన్నాళ్ళూ వూరికోసం పాటుపడేవాడు – నీతో మాట్టాట్టానికి వచ్చి కూర్చుని యివ్వాళ రోడ్డుపని సాగకుండా చేశాడు.

సౌభా—అవును.

ఈశ్వ—మనం యేంచేసినా, అందరికీ ఆనందమైన పనే చెయ్యాలి; వూరికి వుపకారం చెయ్యాలి; మన స్వార్థం మానవసేవకిఅడ్డంవస్తే,స్వార్థాన్నే వదిలెయ్యటం మంచిది.

అమ—ఇంతకూ మీరేమంటారు ?

ఈశ్వ—ఏమంటానికయినా మనమెవరం ? యిది వాళ్ళిద్దరి మధ్యా వ్యవహారం. మనమల్లా వింటే వక్కమాట చెప్పగలం అంతే.

అమ—కాని యీపెళ్లి మా అందరికీకూడా ఆనందకరమైన విషయం. వాళ్లు పెళ్ళిచేసుకుంటె వూరికి నష్టంయేమిటి?
ఈశ్వ—పెళ్ళిచేసుకోవద్దన్నానా! ముందు పెళ్ళా, వూగిపనా ఆలోచించుకోమన్నాను.
సౌభా—ఇప్పుడు నన్నేం చేయమంటారు?
ఈశ్వ—ఏంచేసినా, వూరిపని సాగేట్టు చూడమంటాను. నిమ్మదిగా మీరిద్దరూ కలిసే ఆలోచించుకోండి; నువ్వెళ్ళి వోసారి సుబ్బుల్ని నేను రమ్మన్నానని చెప్పు. అమ రయ్యా, నేనింతలో ఆస్పత్రి దగ్గరకెళ్ళొస్తాను.

[ఇద్దరూ చెరోవైపుకు వెళతారు. సౌభాగ్య బెంగగా కూర్చుని వుంటుంది. రావు వచ్చి]

రావు—వీళ్ళందరూ వెళ్ళారా యేం?
సౌభా—ఆ. వెళ్ళారు.
రావు—ఏం? అలా కూర్చున్నావేం?
సౌభా—ఏం లేదండీ. ఓసలహా చెప్తారా? సుబ్బులు మీకు బాగా తెల్సుగా, అతనెలాంటివాడు.
రావు—చాలా మంచివాడే.
సౌభా—ఊరికోసం అతనెంతో త్యాగం చేస్తున్నాడుకాదూ!
రావు—అందులో సందేహంలేదు, ప్రస్తుతం రెండు చేతుల్తో చేస్తూనేవున్నాడు. పెళ్ళికూడా యింకా కాలేదేమో!
సౌభా—అయితే ... ... పెళ్ళిచేసుకుంటే యేం చెయ్యాడంటారా?

రావు—అబ్బే అది నేనెలా అంటాను? చెయ్యొచ్చు చెయ్యక పోవచ్చు. లోకం సంగతి చెప్పానుగాని, సుబ్బులు సంగతి కాదమ్మోయ్.

సౌభా—అయితే లోకంలో, పెళ్ళి యిటువంటి పన్లకు అడ్డం అంటారా?

రావు—ఇటువంటివి యిల్లా జరుగుతాయని చెప్పటం కష్ట మమ్మా; మనిషినిబట్టి వుంటుంది; మనిషిజీవితాన్ని దేవుడుకంటె కర్మకంటె యెక్కువగా పరిసరాలు మార్చి వేస్తాయి. యివ్వాళ అందరూ వుత్సాహంగా వూరిలో చాలాపనులు చేస్తున్నారు, ఈశ్వరయ్యగారు సుబ్బులూ లాంటివాళ్లు పూనుకోబట్టి కొందరు తెగబడి చేయిచేసు కోటంబట్టిఅందరూపూనుకుని ప్రారంభించారు. మరిన్నాళ్లూ యెవరన్నా చేశారా? నామట్టుకు నన్ను చూడరాదూ! యేదో చదువుకున్నాను, చదువుకునన్నాళ్ళూ తాశిల్దారు చేయాలని వుండేది. యీపాటికి డిప్యూటీ తాశిల్దార యినా అయ్యేవాణ్ణి మాఆవిణ్ణిపెళ్ళి చేసుకోకపోతే. పెళ్లి చేసుకున్నాను. ఈవూళ్ళో యిల్లా మగ్గిపోవాల్సివచ్చింది. "వెళ్ళి . యేదన్నా వుద్యోగం చేస్తానే" అంటే మా నాయన పొలం మక్తాలు యెవరు చూస్తారంటుంది, వాళ్ళ నాయన యెప్పుడో పోయినా, పొలం నన్నూ ఆవిణ్ణి పట్టుకుని వదలటంలేదు. ఆ స్త్రీగల ఆవిడని, నాచేత అడ్డ మయిన చాకిరీ చేయించకపోయినా, పిల్చినపుడల్లా బిళ్ళ బంట్రోతులాగా హాజరవకపోతే పోట్లాడుతుంది.

[కుర్రాడు ప్రవేశిస్తాడు]

కుర్ర—నాన్నా ! అమ్మ రమ్మంటోంది.

రావు—ఎందుకురా యిప్పుడూ ?

కుర్ర—చాకలాడు వచ్చాడు. పద్దు రాయాలిట తొందరగా రా.

రావు—వస్తున్నాఘో. సౌభాగ్యమ్మా! ఆడవాళ్ళకికూడా వయోవిద్యావిధానం పెట్టించరాదూ ? మాకీ పద్దురాయటం తప్పుతుంది. వెళ్ళివస్తా (వెళతాడు)

[కాసేపాగిన తరవాత సుబ్బులు ప్రవేశించి]

సుబ్బు—సౌభాగ్యా !

సౌభా—రండి. కూర్చోండి. వక్కమాట అడుగుతాను చెప్తారా ?

సుబ్బు—ఏమిటది ?

సౌభా—ఇంతవరకూ మీ రెందుకు పెళ్ళి చేసుకోలేదు ?

సుబ్బు—అదేమిటె అల్లా అడిగావ్ ?

సౌభా—చెప్పండి. యింతవరకూ మీరు ... ... ...

సుబ్బు—అంతకంటె యేవో ఆదర్శాలు మనసులోవుండీ.

సౌభా—అంటే ?

సుబ్బు—అంటే............ఏమో !

సౌభా—మీ భావిజీవితం యెల్లాగడపాలని వుంది ?

సుబ్బు—ఇదేమిటె ? యిల్లా అడుగుతున్నావ్ ?

సౌభా—కాదు. చెప్పండి.

సుబ్బు—దేశం కోసం యేమిటో పాటుపడాలని వుండేది. అభివృద్ధిపొందిన యితర దేశాల్లాగా మన దేశాన్ని కూడా మనం బాగుచేసుకోవాలిగనక.........

సౌభా—ఇప్పుడూ అల్లాగే అనుకుంటున్నారా!

సుబ్బు—ఆ. అలాగే అనుకుంటున్నాను.

సౌభా—అయితే అల్లాగే అనుకోండిక, వానికోసం పాటు పడండి, పెళ్ళిసంగతి తలపెట్టకండి, పనిమానుకుని పదే పదే యిక్కడికి రాకండి. వచ్చి నాపట్టుదలను పాడుచెయ్యకండి. నన్ను మరచిపొండి (దుఃఖంతో కుమిలిపోతూ తల చేతిలో దాచుకుంటుంటుంది.)

సుబ్బు—సౌభాగ్యా!

సౌభా—ఇక నన్ను మాట్లాడించకండి; నాకింక మీ మొహం చూపకండి.

సుబ్బు—ఆ - సరే... వెళతాను - (వెళ్ళబోతుంటే)

సౌభా—ఇంతవరకూ మనిద్దరం వూరికి వుపకారమైన పనులు చేస్తున్నాం. యికముందుకూడా మనసంగతి మనం మరచిపోయి, వూరికోసమే జీవిద్దాం. వూరివారి అందరి ఆనందం కోసం పాటుపడదాం; (సుబ్బులు వెళతాడు)

[ సౌభాగ్య అలాగే కూర్చుంటుంది - ఈశ్వరయ్య రెండోవైపునుంచి ప్రవేశించి ]

ఈశ్వ—సౌభాగ్యా.

సౌభా—మీరా!

ఈశ్వ——అవును.

సౌభా——సుబ్బులు వెళ్ళాడు. నేను పంపించేశాను.

ఈశ్వ——నేనూ చూచాను; నన్ను క్షమించు సౌభాగ్యా; వకలక్ష్యంకోసం మనస్సు మొరకుచేసుకోక తప్పదు. మీ యిద్దరి మనస్సులనూ విడదీసి నేను ఆనందించాల్సివచ్చింది; కాని యీ ఆనందం యిక యీజన్మకు వద్దు.

సౌభా——ఈశ్వరంగారూ.

ఈశ్వ——నన్ను క్షమించు తల్లీ! మీమనస్సులను చాలా బాధపెట్టాను.

సౌభా——మీరు బాధబెట్టిందేముంది. తోవతప్పిన మాకు తోవ చూపెట్టారు.

ఈశ్వ——మీరుతప్పుచేస్తుంటే, నే దిద్దగలిగితే, సంతోషంగా ఆపని - చేయగలిగేవాణ్ని; మీరు చేసేది తప్పనగలిగే ధైర్యం నాకులేదు; కనక నే యీబాధ. మీకు "త్యాగం" బోధించి, స్వార్థం వద్దని చెప్తూ. యిద్దర్నీ విడదీశాను. కాని యెందుకోసం విడదీశాను? నాస్వార్థంకోసం. నా వూరి స్వార్థంకోసం. ఒకరి స్వార్థంకోసం మరొకరు త్యాగం చెయ్యటంలో యెవరు బాధపడతారో, యిప్పుడు అర్థమవుతున్నది.

సౌభా——అల్లా అనకండి; ఈశ్వరయ్యగారూ, బాధపడకుండా త్యాగంచేసినపుడు మీరంటున్న దానికి అర్థంవుంది. అంత పవిత్రతలకు యీ ఆత్మ నోచుకోలేదు. నేను త్యాగంచేశానేమో, గాని, బాధ పడుతూనే-వున్నాను.

[ పెరట్లో యేదో గోల వినిపించగా ]

ఈశ్వ—ఏమిటా గోల?..........ఏమిటది?

రామ—(ప్రవేశించి) సుబ్బులు బండిమీదనించి క్రిందపడ్డాడు. వద్దన్నకొద్దీ బండియెక్కాడు. లారీనిచూసి యెడ్లు బెదరి గోడ్డుప్రక్కకి బండి లాగేశాయి.

[అమరయ్య, వీరయ్య, మరికొందరు, సుబ్బుల్ని మోసుకు వచ్చి బల్లమీద పడుకోబెడతారు.]

అమ—(ఒకనితో) నువ్వెళ్ళి డాక్టర్ గారిని పిల్చుకురా. అదృష్టం. అసలు ప్రాణాలే పోవాల్సినదెబ్బ (లోపలికిచూసి) అదిగో! డాక్టరుగారే యిటు వస్తున్నారు.

(డాక్టరుగారు పరీక్షచేసి కట్టుకడతారు.)

ఈశ్వ—ప్రమాదం లేదుకదా డాక్టర్ గారూ.

డాక్ట—ఫరవాలేదు. తలదిమ్మెక్కింది. కాసేపు యిక్కడే పడుకోబెట్టండి. కదిలించవద్దు. కదిల్తే మరీ నెత్తురుకారుతుంది. నేను మళ్ళా సాయంకాలంవచ్చి చూస్తా. చుట్టూ అందరూ మూగకండి. దగ్గర వొకరో యిద్దరో వుండండి. చాలు.

[డాక్టర్ గారితోపాటు అందరూ వెళతారు. ఈశ్వరయ్యగారు సౌభాగ్యా వుంటారు].

సౌభా—ఫరవాలేదంటారుగదా!.

ఈశ్వ—ఫరవాలేదమ్మా!.

సౌభా—మందేమన్నా యిస్తారేమో కనుక్కోలేదు?

ఈశ్వ—ఇవ్వాల్సివుంటే యివ్వరూ?
సౌభా—ఇంజక్షన్ నిప్పిస్తే మంచిదేనా.
ఈశ్వ—అక్కరలేదనుకుంటాను.
సౌభా—సుబ్బులూ! సుబ్బులూ!
సుబ్బు—(బలహీనంగా సంధిలో మాట్లాడుతాడు) అందం వేరూ, ఆనందం వేరు.
సౌభా—మాట్లాడుతున్నాడండీ.
[దగ్గర చేరుతారు. సుబ్బులు నిమ్మదిగా లేస్తూ మాట్లాడతాడు గాని ఈశ్వరయ్య, సౌభాగ్యా లేవనివ్వరు.]
సుబ్బు—మన మనస్సుకు ఆనందం వేరు, అందరి ఆనందం వేరు!
సౌభా—సుబ్బులూ!
సుబ్బు—అసలు ఆనందం మనస్సులో లేదు, అందరి ఆనందమే మన కానందం.
సౌభా—ఏమిటండీ! యిట్లా మాట్లాడుతున్నాడేం?
సుబ్బు—అందరి ఆనందానికీ యీ శరీరాన్నాహుతి చేయటమే, జీవితమంతటికీ పరమానందం (పడిపోతాడు)
సౌభా—(సుబ్బులూ అంటూ మంచంమీద పడిపోతుంది)
ఈశ్వ—ఏదో సంధిలో మాట్లాడుతున్నట్టున్నాడు.
సౌభా—(లేచి) డాక్టరుగారిని త్వరగా పిలవండి!
ఈశ్వ—సుబ్బులూ, సుబ్బులూ!
సౌభా—మాట్లాడటం లేదండీ; పాపం మనస్సులో యెంత మధనపడుతున్నాడో. నే నన్నమాటలే పలికిస్తున్నాడు సంధిలోకూడా.

ఈశ్వ—విచారించకమ్మా ? నీవల్ల అతని మనస్సు కుదుట పడింది. నువ్వన్న మాటలు అతని మనస్సును తప్పపరచి, జీవితాన్ని పవిత్రం చేస్తాయి? ఆరని అసంతృప్తితో ఆ జన్మాంతం మానవసేవలో వళ్లు మరచిపోతాడు. అందరి ఆనందంలో నే తన ఆనందాన్ని వెతుక్కుంటూ జీవితపు టంచులు దాటిపోతాడు. ఇక జీవితాన్ని సరిదిద్దుకోవా ల్సిందీ మనస్సును నిలదొక్కుకోవాల్సిందీ నువ్వు.

సౌభా—ఆ.

ఈశ్వ—దోవలోవున్న నీమనస్సు మారువోన పట్టకుండా చూసుకో. (సుబ్బులు కదులుతాడు)

సౌభా—సుబ్బులూ !

ఈశ్వ—సుబ్బులూ !

సుబ్బు—(నీరసంగా కళ్లు తెరచి చూచి) ఆ. పిలిచారా ...

సౌభా—(సంతోషముతో) తెలివివచ్చిందండీ. తెలివొచ్చింది.

ఈశ్వ—సుబ్బులూ ! ... ... సుబ్బులూ ! ... ...

—: తెర :—

## మూడవ రంగము

[ అదే రంగం. రావు, కొందరు వయోవృద్ధుల్ని రామయ్యా, కేశవయ్యా, తాత, వీరయ్యా, మరికొందర్ని కూర్చో బెట్టి పాఠాలు చెపుతున్నాడు]

రావు——ఆ. అందరూ పుస్తకాలు తీసుకోండి; హిందీమాటలు చెప్తా, రాయండి, దునియా ... దు ... ని ... యా; దాని యెదురుగుండా అర్థంరాయండి. ముసాఫిర్ - మేలా - ఘోడా - గరీబ్ - చిడియా, ఆంఖ్ - ఫాయిదా - దౌలత్ - షికారీ - అర్థాలు రాశారుగా. ఆ కాగితాలు యిట్లా యివ్వండి. ఇక ప్రశ్నలు వేసి మార్కులు యిస్తాను. మనదేశంలో యెన్ని యినపకర్మాగారాలు కడుతున్నారు ? నువ్వు చెప్పు తాతా !

తాత——మూడు.

రావు——రైట్ ... మనకున్న పుణ్యక్షేత్రాల్లో పెద్దదేదీ ? నువ్వోయ్. రామయ్యా! కూర్చొని చెప్పు.

రామ——కూర్చుంటే నాకు బాగా వుండదండీ. మీరుపంతులు కాదండీ; కాశీ అనుకుంటా.

రావు——రైట్...మన మొదటి గవర్నర్ జనరల్ యెవరు ? వీరయ్యమామా !

వీర——రాజగోపాలాచారి.

రావు——తప్పు, కూర్చో.

వీర—ఏం.

రావు—ఏం లేదు. తప్పు కూర్చో.

వీర—అదేంటయ్యా? రాజగోపాలాచారేగా! కాదంటావేం?

రావు—కాదంటే కాదు. అంతే.

వీర—నీ చదువు బాగానే వుంది. రైటయితే తప్పంటావేం.

రావు—నేనేం అడిగాను? మొదటి గవర్నర్ జనరల్ అన్నాను. మొదటి భారతీయుడు అన్నానా?

వీర—అదా! అందరికీ మంచి ప్రశ్నలు వేసి, నాకు తికమక ప్రశ్న వేశావ్; నే నొప్పుకోను.

రావు—ఇదిగో. నేనా నువ్వా మేష్టారు?

వీర—ఎంతమాష్టరయితే మాత్రం యింత అన్యాయమా?

రావు—నువ్వు ప్రశ్న సరిగ్గా అర్థంచేసుకోకుండా నే నన్యాయం చేశానంటావేం?

వీర—అన్యాయంకాదూ! ఆ తాతకి అంత తేలిక ప్రశ్న వేసి నాకేమో తికమక ప్రశ్న వేస్తావ్. యేం న్యాయం యిది?

రావు—న్యాయంలేదు. అన్యాయంలేదు. అంతే ఫో.

వీర—సరే కానివ్వండి. పంతులయితే మాత్రం, అన్యాయం చేసి యేం బాగుపడతాడు?

రావు—మొన్న నీ మధ్యన ఆంధ్ర దేశములో ప్రారంభోత్సవం చేసిన వెలిక్ట్రీ వెలిగించే పెద్దయింజను యేది? చెప్పు. కేశవయ్యా!

కేశ—మాచ్ ఖండు,

రావు—కాదు.
కేశ—అవును.
రావు—(గట్టిగా) కాదు.
కేశ—అవును.
రావు—అవున్లే.
వీర—ఇదేంటయ్యా మాస్టారూ సర్గా చదువుకురానక్కర్లే.
రావు—మరచిపోయూ లేవూనూ కోప్పడకు. యెక్కడపడితే అక్కడ యేవేవో పెగడతున్నారు. యెన్నని జ్ఞాపక ముంటాయి.

[ కుర్రవాడు ప్రవేశించి ]

కుర్ర—నాన్నా నాన్నా! అమ్మ పిలుస్తోంది.
రావు—పిల్చిందీ? నేననుకుంటూనేవున్నా యింకా పిలవలేదేమా అని. ఆ. మీరందరూ, చూచివ్రాత రాయండి.
వీర—ఏం. నువ్వు వెళతావా యేంటి!
రావు—మరి పిలిస్తే వెళ్ళొద్దూ.
వీర—ఎట్లా యెళితే. బళ్ళో పాఠం మద్దెలో?
కేశ—పోన్లే వెళ్ళిరానీ. మనకిమాత్రం పెళ్ళాల్లేరా! రేపింకో సారి పిలవరా!
రావు—వస్తా. చూచివ్రాత రాయండీలోపుల (వెళతాడు)
వీర—పెళ్ళాంవుంటే పిలవటమేనా యేం. యినతల పనిమీ దుంటే? యిదేం చిన్నలొట్టికాయల్కి పాఠాలు చెప్తున్నా డనుకుందా! మీసాలు మెలితిరిగినవాళ్ళంతా యిక్కడ.

పాతాలకి కూకుంటే. ఆ, ఆ, అంతా చూచిరాత రాయండి.

రామ—రావుగారిని రానిద్దూ. ఇంతలో మళ్లా చూచిరాతెందుకు ?

వీర—ఏందిరోయ్, నేను మాన్ యీటర్ని. తెలుసా, చూచిరాత రాయమంటె, తస్సదియ్య! మానేసి కబుర్లు లంకించుకుందామనే ? రాయండి, చూచిరాత.

రామ—మరి నువ్వూ రాయి.

వీర—నేనెందుకూ ? నేను మూషోక్లాసు. తెలుసా.

రామ—అయితే నువ్వు రాయకుండా మాచేత రాయిద్దామనేం.

వీర—నేనూ రాత్తాను; మీరూ రాయండి; (రాశి) అరేయ్ కేశవయ్యా. మొన్న పేపర్లో యేంపడిందో తెలుసా, అక్కడెక్కడో చేత్తో గడియారాలు చేయిత్తున్నారంటరా గుడిశెల్లో,

కేశ—గుడిశెల్లోనే, ఫ్యాక్టిరీలో గడియారాలుకాని గుడిశెల్లో యెట్లా చేత్తారశే. బొమ్మగడియారాలేమోలే.

వీర—కాదురా! చేయిత్తున్నారంట, తస్సదియ్య, ఆడే గడియారాలేనంట! సుబ్బుల్ని అడిగితే "అన్ని పనిముట్లు చెయ్యొచ్చు మామా, మన గుడిశెల్లోనే చేయొచ్చు" అన్నాడు.

రామ—వూరుకోవోయ్. చూచిరాత రాత్తుంటే యేంటా

వీర—ఏమిట్రోయ్. మాసీటర్ని నేను మాట్లాడుతుంటే గోలంటావ్. ఇదంతా ఎడ్డుకేషనోయ్ — యెడ్డుకేషన్ యెలక్ట్రీ దీపాలు చూచావురా నీ జన్మలో యెదవ నాయాలా— పెద్ద మాట్టాడుతుండావు.

రామ—బూతులు మాట్టాడరాదు.

వీర—ఏంటిరా అదీ?

రామ—చూచిరాత లే

వీర—ఏడిశావు యెధవ నాగన్నా! పెద్దమనుషులెవరూ లేరుగదా అని నేను నోరుజారితే, లే. ఎక్కు బెంచీ.

రామ—నేనెందుకూ? తప్పు నువ్వు మాట్టాట్టమేంటీ — నేను బెంచీ యెక్కటమేంటీ? నువ్వే బెంచీ ఎక్కాలసలు.

వీర—నేను పెద్దవోణ్ణి "పెద్దల గౌరవించవలెను" అని చదవలే. యెక్కు బెంచీమీాద.

[ఈశ్వరయ్యా అమరయ్య ప్రవేశించి]

ఈశ్వ—(త్వరగా వెళ్ళి బెంచీ దగ్గర నుంచొని) వీరయ్యా బెంచీయెక్కు.

వీర—నేనా?

ఈశ్వ—నువ్వే.

వీర—(నెమ్మదిగా బెంచి యెక్కుతాడు— బిక్క మొహంతో)

(అందరూ నవ్వుతారు)

ఈశ్వ—ఆ పటం నెమ్మదిగా తీసియివ్వు, (వీరయ్య పటం తీసియిస్తాడు) అనిగోసయ్యా, గ్రామ సహకార జీవనం

అని దీంట్లో రాశాడు. వున్న బంజరు అంతా సహకార సంఘంకింద సాగు చేసి ఫలసాయం అంతా పనిచేసిన వాళ్ళు పంచుకోటం. దీనివల్ల యిటు అధికంగా పంటలూ సాగుతాయి, మరికొందరికి పనీ దొరుకుతుంది. దీన్ని గురించి వివరాలు సంపాదిద్దాం.

అమ—ఆ, కుటీర పరిశ్రమను గురించి కూడా వివరాలు తెప్పించండి.

ఈశ్వ—ఆ, అవ్వీ తెప్పిస్తా. పూర్తిపనులు చాలావరకు అయినవి. యిక నిమ్మదిగా యీ అభివృద్ధి కార్యక్రమం మొదలెడదాం.

వీర—మరిక నేను బెంచీ దిగనా అండీ?

ఈశ్వ—దిగు. యెవరు వద్దన్నారు?

వీర—అహా! మీరు బెంచీ యెక్కించారుగా?

ఈశ్వ—ఎప్పుడూ?

వీర—ఇప్పుడే. బూతు మాట అన్నానని.

ఈశ్వ—అన్నావా యేమిటి? యెప్పుడూ?

వీర—మీరు వినలే. వినే నన్ను బెంచ యెక్కించారనుకున్నా (అని దిగుతాడు)

ఈశ్వ—అలాగా......దిగుతావేం? బెంచీ యెక్కు.

వీర—ఎందుకండీ?

ఈశ్వ—అదేదో అన్నానని నువ్వే అన్నావుగా?

వీర—బలే వోరండీ మీరు (ఎక్కబోగా)

ఈశ్వ—వస్తుందే వీరయ్యా, మాట. త్వరలో మనవూరికి ఎలక్ట్రిసిటీ వస్తుందట.

వీర—మనవూరికే, ఎలక్ట్రీయే, పూరుకోండి, వేళాకోళాలు! మహామహా మా అత్తారి వూరికే రాలేదు.

ఈశ్వ—కాదయ్యా. వస్తుందట; మనకు దగ్గర కృష్ణమీద పెద్దప్రాజెక్టు కడుతున్నారు. పేపర్లో చదవలే? అది కడితే ఆంధ్రదేశానికి బోలెడంత ఎలక్ట్రిసిటీ.

వీర—అయితే నిజమే. నిజమేనా అమరయ్యా! తస్సదియ్య, అయితే మా పాకలో ఆరి వెలిగే వెలిగి ఆరే దీపాన్ని పెట్టిస్తా ఓరేయ్.. మీ గొడ్లు బెదుర్తాయి దీపాలు చూశి. జాగర్తగా కట్టేసుకోవోవ్.

వక—జాగర్త కాదు జాగ్రత్త.

వీర—అదేలే జాగరత, అహ జాగ్రత. అహాహా, జాగ్రత్ర యేమిట్రా. మళ్ళీ అనుయెట్లాఅనాలో? జా,...గ...

వక—జాగ్రత్త

వీర—అహ...జాగ్రత్త

ఈశ్వ—అమరయ్యా చూశావా? మన వూరిలో ఆరోగ్యం యెంత బాగుపడిందో, ఆసుపత్రిలో కేసులే తక్కువయ్యాయిట.

[సుబ్బులు ప్రవేశించి [illegible]

అమ—ఆ, మొన్నమటుకు మొన్న [illegible] ఇన్‌స్పెక్టర్ వచ్చి చూశి, తెల్లబోయి కూలబడాడు.

వీర—ఆ, మా బావమరిది వచ్చి బావురుమనలే. ఆళ్ళ వూళ్ళో చెరువు తవ్వించటానికే తలపట్టు పట్టుకొంటు న్నారట.

ఈశ్వ—ఆ, మనం యిక బయలుదేరదామా?

వీర—ఎక్కడికి?

ఈశ్వ—మన సహకార సంఘంలో అందర్నీ చేర్చుకోటానికి.

వీర—సహకార మంటె బ్యాంకా?

ఈశ్వ—Bank కాదు. మన వూరిలో వడ్ల దగ్గరనించీ నెయ్యి, కూరలు మొదలైన అనేక రకాలైన వ్యాపారాలు యెవరికి వారు చేసుకుంటున్నారు. అలా యెవరికి వారు చేసుకునే బనులు అంతా వక సంఘంగా యేర్పడి చేద్దాం. అందువల్ల అధిక లాభాలే కాక ఖర్చులు తగ్గుతాయి; రేపు మనం కుటీర పరిశ్రమలు పెడితే అవ్వీ దీనిలోనే అమ్మించవచ్చు. దీన్లోనే బంజరు భూములు కూడా సాగు చేయించి పనిలేని వాళ్ళకి పని చూపించవచ్చు. యిలాగే అనేకరకాలపన్లు.

వీర—తస్సాదియ్య! చెయ్యాల్సింది చాలావుందే.

ఈశ్వ—చాలావుంది. పదండి. వూరందరికీ యివ్వన్నీ నచ్చ చెప్పి అందర్నీ చేర్పించాలి. ఆ, అమరయ్యా! యీ పచా రానికి పనికొచ్చే గవర్నమెంట్ కాగితాలున్నాయి. పట్రా వాటిని. (అమరయ్యా పట్టుకురాగా అందరూ వెళ తారు)

[అందరూ వెళ్ళిన తర్వాత సుబ్బులు చొక్కా వేసుకు బయలు దేరుతుంటే వెనకనే సౌభాగ్యకూడా వచ్చి]

సౌభా—ఎక్కడికి బయలుదేరుతున్నారు?

సుబ్బు—వూళ్ళోకి.

సౌభా—డాక్టరు గారింకా యెక్కడికీ వెళ్ళొద్దూ అంటున్నారు. క్షణం కూర్చోకుండా మీరు తిరుగుతూనే వున్నారు.

సుబ్బు—కూర్చుంటే యెలా?

సౌభా—అంత దెబ్బ తగిలితే విశ్రాంతి తీసుకోపోతే యెలా?

సుబ్బు—విశ్రాంతి అని యిచ్చట కూర్చుంటే అస్పత్రిలో పనెవరు చూస్తారు?

సౌభా—యెవరో వకరు; మన ఆరోగ్యం మనం చూచుకోకపోతే యెలా?

సుబ్బు—మన ఆరోగ్యం మనంచూసుకుంటే అందరి ఆరోగ్యం యెవరు చూస్తారు?

సౌభా—పోనీ, ఆసుపత్రిలో పనిచేసి వూరుకుంటున్నారా? వూరిలో అందరి పనీకూడా మీదేనాయె.

సుబ్బు—ఆ. నాదే (వెళ్ళబోతాడు)

సౌభా—ఆ. వెళుతున్నారా?

సుబ్బు—వెళ్ళవద్దంటావా?

సౌభా—మిమ్మల్ని యిక్కణ్ణించి వెళ్ళనివ్వొద్దన్నారు, ఈశ్వరయ్యగారు.

సుబ్బు— నేనిక్కడమాత్రం ఒక క్షణం వుండలేనని చెప్పా.

సౌభా—ఏం ? యెందుకు వుండలేరు ?

సుబ్బు—ఎందుకనా ! యేమో. యిక్కడ వుంటె యేదో మంటబెట్టినట్టుంటుంది, అందుకని వూళ్లో అందరి సంగతీ చూస్తుంటే నాసంగతి మర్చిపోగలను అందుకని.

సౌభా—ఈ లైబ్రరీ అరుగులు ఏం పాపం చేసుకున్నాయో.

సుబ్బు—పాపం ప్రాణంలేని అరుగులు చేసుకోవు.

సౌభా—అయితే ప్రాణం వున్న నేను పాపం చేసుకున్నా కాబోలు.

సుబ్బు—సౌభాగ్యా !

సౌభా—ఛీ. నువ్వేవో స్వార్థం విడచిన త్యాగమూర్తి వను కున్నాను.. మనసును మోసగించుకోటానికి, ప్రజాసేవనే ముసుగు వేసుకున్నావనుకోలేదు, మనసులో యేదోబాధ పడుతూ బాధ మరచిపోవటానికి మత్తుమందు వాడుతు న్నావ్. ఇదేనా అందరికోసం ఆహుతి అయిపోవటం, యిదే నా నీత్యాగం, యిదే నా నీ ఆదర్శం.

సుబ్బు—సౌభాగ్యా ! నన్ను క్షమించు. దేశంకోసం ఆహుతి అయిపోవటానికి నేను సిద్ధమే. నాదేశం కోసం నా వూరి కోసంనేనేమైనా చేస్తాను. కాని దేశసేవకు పూనుకుని-పని చేసినా హృదయాన్ని రాయిచేసుకోవాలా ? దేశంకోశం కష్టపడినా, మనకోసం కొంతసుఖపడకూడదా ?

సౌభా—ఏమో! అదంతా యిప్పుడు మాట్లాడాల్సింది కాదు. మనకో ఆశయంవుంది; ఆశయం సాధించేవరకూ అన్యా లోచనే పనికిరాదు.

సుబ్బు—తర్వాత- తర్వాత సంగతి చెప్పు సౌభాగ్యా!

సౌభా—ఆ సంగతి యిప్పుడు చెప్పినమాత్రం యేం లాభం?

సుబ్బు—లాభం వుంది. అది తెలుసుకుంటే వెయ్యి యేను గుల బలంతో పనిచేయగలను. చెప్పు సౌభాగ్యా.

సౌభా—సుబ్బులూ!

సుబ్బు—సౌభాగ్యా! ఓ. నే వస్తాను. యిప్పుడు నన్నేం చేయమన్నా చేయగలను. యిటువంటి గ్రామాలు వెయ్యింటిని కట్టించగలను సౌభాగ్యా.

సౌభా—కాని మనవూరి పనులు పూర్తి అయ్యేవరకూ, మనమీసంగతి మాట్లాడకూడదు.

సుబ్బు—ఓ అల్లాగే.

సౌభా—మన సంగతి మనం మాట్లాడకుండా వుండాలంటే మనం మాట్లాడుకోనేకూడదు.

సుబ్బు—అదేమిటి?

సౌభా—మాట్లాడితే అన్ని మాటలతో యీ మాటలూ వస్తాయి.

సుబ్బు—కాని,

సౌభా—కానీ లేదు గీనీ లేదు. అదంతే.

(సౌభాగ్య లోపలికెళుతుంది. సుబ్బులు నుంచుటాడు.)

[ ఈశ్వరయ్యా, అమరయ్యా, వీరయ్యా వస్తారు ]

ఈశ్వ—వున్నావా సుబ్బులూ; మన సహకారసంఘం చాలా గొప్పగా తయారవుతోంది.

సుబ్బు—ఇప్పుడేగా వూళ్లోకి వెళ్ళారు, అప్పుడే తయారయిందా.

ఈశ్వ—అప్పుడే యేమిటి? వెళ్ళి ప్రెసిడెంటుగారితో మాట్లాడాం. ఆయన మాపార్టీ వాళ్ళం అయిదువేలు పోగుచేస్తాం" అన్నాడు. మాపార్టీ ఆరువేలన్నాడు అమరయ్య.

అమ—అహా. నేనన్నది యేడువేలు.

ఈశ్వ—దాంతో ఆయన యెనిమిదివేలు, అన్నాడు.

అమ—నేను తొమ్మిదివేలు అన్నాను.

ఈశ్వ—ఆయన పదివేలు అన్నాడు.

వీర—తస్సదియ్య! దీంట్లోనూ పోటీలే.

ఈశ్వ—సరే. చెరో పదివేలన్నారు. ఇరవై వేలతో రేపీపాటికి సంఘం రిజిష్టరు చేసేస్తాం. ఆసుబ్బులూ, సౌభాగ్య యేదీ?

సుబ్బు—లోపలున్నది.

ఈశ్వ—ఒక్కసారి పిలు. పనుంది.

సుబ్బు—(ఏంచెప్పటానికి తోచక) ఊఁ,

ఈశ్వ—ఏం ఆగావేం? వక్కసారి సౌభాగ్యను పిలవయ్యా.

సుబ్బు—నే పిలవను, మరెవరినన్నా పిలవమనండి.

ఈశ్వ—అదేమిటి?

సుబ్బు—ఏంలేదు.

వీర—నే పిలుస్తాలెండి; సౌభాగ్యమ్మా!

ఈశ్వ—పోటీలుపడి మన సహకారసంఘానికి మూలధనం చందా వేశేశారు.

సౌభా—పోటీలా ?

వీర—ఆ, 'పోటీలు' యిదివరకు రోజుల్లో పోటీలుపడి ఊరిని నాశనం చేసేవారు, అయ్యి కాదులే యివ్వి. నేను అయిదు వేలంటే తన్నాదియ్యా! నేను పది వేలనీ వేశారు.

సౌభా—ఇదీ బాగానేవుంది.

ఈశ్వ—ఇక పొదుపు కార్యక్రమం నువ్వు సాగించాలి.

సౌభా—ఓ – అలాగే. (సుబ్బులు లోపలికి వెళ్ళిపోవును)

వీర—అదేంటండోయ్. కొత్తగావుంది ?

అమ—అంటే అదేలే, మనడబ్బు కొంత తప్పనిసరిగా దాచుకోవటం.

వీర—ఎక్కడా.

అమ—బ్యాంకులోనే.

ఈశ్వ సుబ్బులేడీ ?

సౌభా—లోపలికెళ్లాడు.

ఈశ్వ—నువ్వూ సుబ్బులూ కల్సివెళ్ళి యీ కార్యక్రమం సంగతి అందరికీ చెప్పాలి. వొకసారి సుబ్బుల్ని పిలు.

సౌభా—(వెళ్ళబోయి ఆగి) అహ, మీరెవరన్నా పిలవండి.

ఈశ్వ—అదేమిటి? ఉతనూ అల్లాగే అన్నాడు, నువ్వూ అల్లాగే అన్నావ్.

సౌభా—అహం. గోం కేడు.

(అందరూ మొహామొహాలు చూసుకుంటారు)

వీర— ఏదో అలక వచ్చినట్టుందండీ. (అందరూ నవ్వుతారు)

ఈశ్వ—నువ్వు పిలు-- వీరయ్యా.

వీర—నే పిలవను. నాకేం,

ఈశ్వ—నువ్వు పిలవయ్యా! అమరయ్యా.

అమ—నాకేం పట్టింది, నేనూ పిలవను.

ఈశ్వ—నువ్వయ్యా కేశవయ్యా!

కేశ—అహా.

ఈశ్వ—అయితే మీా అందరికీ లేనిది నాకేనా యేమిటీ? నేనూ పిలవను.

అమ—బాగానే వుంది- పొదుపు కార్యక్రమం.

వీర—ఏం పొదుపు.

అమ—మాటల పొదుపులే.

వీర—అయితే యికనించి నేనూ పొదుపుగానే వుంటా.

అమ—ఎవ్వరితో?

వీర—సీతోనూ, ఆరితోనూ, ఊ- మాఆవిడతోగూడా.

అమ—నువ్వంటావ్ సరేకాని మీాఆవిడ వుంటుందా?

వీర—అది కొత్త కష్టమే ననుకో. గాని యిది అయిదేళ్ళ ప్లానే యికనించి "అంతా" పొదుపే అని చెప్తాగా? ...

ఈశ్వ—"అంతా" అంటున్నావు- అదేమిటయ్యోయ్.

అమ—అదా... అదేలెండి ... ... ...

వీర—సౌభాగ్యమ్మా! నువ్వే కార్యక్రమం పెట్టినా సరే

సౌభా—ఛ. ఏం మాటలన్నీ, (లోపలికి వెళ్ళబోతుంది)

వీర—వెళ్ళిపోతావేం ? ఆగు.

(నవ్వుతారు; నవ్వులాగే సరికి సుబ్బులు బయటకొస్తాడు)

వీర—ఇదేం యిచిత్రం! ఉడుంగున ఆమె లోపలికెళితే బుడుంగున యీయన బయటికి వచ్చాడు.

ఈశ్వ—నువ్వూ సౌభాగ్యా కలిసి పొదుపు కార్యక్రమం సాగించాలయ్యా.

సుబ్బు—ఏమిటది ?

వీర—ఆ. ఆ కార్యక్రమాలన్నీ వొయసు ముదిరిన ముసలోటి వాళ్ళకుగాని, ఆళ్ళకసలు పనికిరావండి.

సుబ్బు—అవునండీ, మాకెందుకూ ? మాయిద్దర్నీ వదిలెయ్యండి, కావాలంటే యీ కార్యక్రమానికి మరెవర్నన్నా పంపించండి.

అమ—ఈ కార్యక్రమానికి వీళ్ళిద్దర్నీ వదిలేద్దాంలెండి.

ఈశ్వ—మరెవర్ని పంపుదాం ?

అమ—ఎందుకూ వీరయ్యనీ – వీరయ్య భార్యనీ పంపండి. రెండు కార్యక్రమాల ప్రచారం వక్కసారే జరిగి పోతుంది.

ఈశ్వ—అవును; ప్రచారంగూడా పొదుపుగా సాగుతుంది. కాని వీరయ్యమామా, ప్రచారం చేయటంతో పూరు కోటం కాదు. చాలా కఠినంగా అమల్లో పెట్టాలి.

వీర—ఆ. వొకటి యిదివరకే అమలులో పెట్టాం. రెండవది తేలిగ్గానే పెట్టవచ్చు.

అమ—అంత తేలిగ్గానే అనేస్తున్నావేం? ఆలోచించుకో - రెండవదాని విషయం అంత తేలికగాదు.

వీర—తేలిగ్గాకేముంది. మాఆవిడతో వక్కమాట చెప్తే చాలు. యిప్పుడుమాత్రం అంత తేలిగ్గా బయటపడదు గాని రోజూ పావలా అర్ధా దాచి పారెయ్యకుండా వుందీ?

ఈశ్వ—ఇంట్లో దాచుకోటంకాదు, అది బ్యాంకులో పడెయ్యాలి లేదా సర్టిఫికెట్లుకోనాలి. అంటే డబ్బు గవర్నమెంటుదగ్గర దాచుకోవాలన్నమాట.

వీర—దాచుకుంటే ?

ఈశ్వ—అల్లా దాచుకుంటే మనకి వడ్డీవస్తుందీ ఆడబ్బుతో మరికొన్ని ప్రాజెక్టులూ మరికొన్ని కర్మాగారాలు కట్టవచ్చు.

వీర—మా ఆవిడ యిచ్చిన పావలా అర్ధాతోనా.

ఈశ్వ—ఆ, మీాఆవిడలాగా, అందరూ పావలా అర్ధా కడితే కడితే అన్నీ కలిపి కొన్నికోట్లవుతాయి.

వీర—అదా కిటుకు? మరీ డబ్బంతా ఖర్చుపెట్టేస్తే తిరిగి యివ్వటం యెలా ? యెగెయ్యరుకందా ?

ఈశ్వ—దానిదేముందీ ? ఇస్తారు. అందరూ వక్కసారే వచ్చి యియ్యమని కూర్చోరుగా ?

వీర—అహా !

ఈశ్వ—మనమిప్పుడు దేశసేవంటే ప్రాణాలొడ్డి పోరాడ సక్కర్లే, యిల్లాంటి చిన్నవిషయాలల్లో మనం సహకరిస్తే చాలు.

వీర——తప్పదియ్యా! ఈ కార్యక్రమాల్లోగూడా దేశసేవ వుందేం!

అమ——ఆ, ఆ, పొదుపులన్నింటిలోనూ దేశసేవ వుంది.

వీర——ఈపొదుపులో దేశసేవ కనిపిస్తూనే వుందీ. లేవయ్యా! నేననేది రెండోసంగతి.

అమ——అవును. జనాభా పెరిగినకొద్దీ, దానికి తగినట్టు పంటలు యెక్కువ పండించాలి. జనాభా పెరక్కుండా పంటలెక్కువగా పండిస్తే దేశం భాగ్యవంతమవుతుంది. దేశం భాగ్యవంత చేయాలంటే ... ... ...

వీర——అహా - వకపంట తగ్గాలి. ఒకపంట పెరగాలన్న మాట.

[ రావు ప్రవేశించి ]

రావు——అందరూ యిక్కడే వున్నారా? విద్యార్థులందరూ వెళ్ళారా యేమిటి?

అమ——అవ్వేమిటండోయ్, కాగితాలు తెచ్చారు?

రావు——ఇవి పరీక్ష పేపర్లు లే.

వీర——మావేనా అండీ?

రావు——ఆ. మీవే.

వీర——ఇవ్వేనా? యీ నాలుగే.

రావు——ఆ, మరిచదువుకు నేపిల్ల లెంతమంది? కాస్త నాలుగు వాక్యాలు చదివేసరికి, మానుకుని పోతున్నారు. నిలబడి అయిదోక్లాసన్నా చదవటానికి ఓపిక వుంటేనా?

వీర—నా పేపరు కాగితంకూడా దిద్దారా అండీ ?

రావు—నీ పేపరుదిద్దా. నీవు ఫైల్.

వీర—ఫేలా ! అంతబాగారాత్తే,

రావు—ఏమీ రాయలే.

వీర—ఇదేంటయ్యా అన్నీ నువ్వు చెప్పినయ్యే రాశాగా ?

రావు—రాస్తే రాశావ్. రాశినా ఫైలే.

వీర—అన్నాయం చూచారా ? ఈశ్వరంగారూ రాశినా ఫేలే ? రాయకపోయినా ఫేలేనా.

అమ—పోనీలెండి. యీతడవకి ప్యాసుచేయండి.

రావు—ఎట్లాగండీ ? వీలులేదు.

ఈశ్వ—ఏదోచూడండి. రావుగారూ. పాపం మరీ గోలచేస్తున్నాడు.

రావు—ఎట్లాగండీ ! అసలే మూడోక్లాసులో పిల్లలు లేకపోతే. (నవ్వుతారు)

వీర—నీకు క్లాసులో పిల్లలులేరని నన్ను ఫేలుచేత్తా ? యిదిగో చెపుతున్నా ఎత్తే నాలుగులోయెయ్యి. లేదా నే బడికి కే రాను. ఆ.

రావు—బాగానేవుంది, సరే యేదో చూస్తాలే,

ఈశ్వ—ప్యాస్ చేయండిగాని, మనలోమాట, పేపర్ బాగా రాశాడా ?

రావు—చెప్పమంటారా, బాగానే రాశాడు.

వీర—బాగారాయకేమండీ ! ఆరి అబ్బాయి రాశిందంతా నేనూరాత్తే.

రావు—ఏమంటావ్ ?

వీర—ఏం లేదులెండి.

అమ—అయితే బాగానే రాశాడన్నమాట.

రావు—అదే చూస్తున్నా "అంత బాగాయెట్లారాశాడా" అని. అయినాసే ఫైల్.

ఈశ్వ—వద్దులెండి. యిక యెప్పుడూ కాపీకొట్టడు.

వీర—కాపీకొట్టలేదండీ, ఆకుర్రాడు పైకి చదువుతూ రాశాడు.

[ సుబ్బులు ప్రవేశించి పేపరులో వక కాలం చూపుతూ ]

సుబ్బు— ఈశ్వరంగారూ యీశ్వరంగారూ! యిదిచూచారా ?

ఈశ్వ—ఏమిటది ?

సుబ్బు—పేపర్లోపడింది. భారతసేవక సమాజ్ వారిప్రకటన. ప్రాజెక్టులు కట్టటానికి ప్రజల సహాకారంకావాలట, (చదువుతూ) "కృష్ణమీద ప్రాజెక్టుకట్టటానికి వేలాది ప్రజలను వాలంటీర్లను, ప్రచారంచేసి చేర్పించటానికి యువకులు ముందుకురావాలి, నవభారత నిర్మాణానికి నవయువకులంతా నడుంకట్టాలి." నేనూ వెళతాను.

అమ—నువ్వా ! ! !

వీర—నువ్వు వెళ్ళిపోతే వూళ్ళోపని ఆగిపోదూ ?

రావు—అబ్బే. మనగ్రామంసంగతి పూర్తికానిద్దూ. దేశంకోసం మనమొక్కడికి వెళ్లగలం.

సుబ్బు—లేదు. వెళ్ళాల్సిందే. యిది మనపని. అది దేశం అందరిపనీ. దేశంకోసం శ్రమపడటానికి అమూల్యమైన అవకాశం లభించింది, వెళ్ళాల్సిందే - వెళ్ళి తీరాల్సిందే.

ఈశ్వ—కాని సుబ్బులూ యిట్లా మధ్యలో మన గ్రామాన్ని వదిలివేస్తేమెలా? యిది మనదేశం సరే, కాని యిది మనగ్రామం; గ్రామానికి సేవచేశినా దేశానికి సేవచేసి నట్టే.

సుబ్బు—నిజమే కాని, యింతటి అవకాశం మళ్లీ యెప్పుడు దొరుకుతుంది? కాదండీ యీశ్వరంగారూ నాకడ్డం రాకండి.

ఈశ్వ—తొందరపడకు సుబ్బులూ!

సుబ్బు—తొందర యేంలేదండీ; నేను వెళతాను.

ఈశ్వ—నువ్వన్నా చెప్పవమ్మా సౌభాగ్యా.

సౌభా—(చెప్పబోయి దగ్గరకెళ్ళి) సుబ్బులూ ... ...

సుబ్బు—దేశంలో అందరిమేలుకోసం ఆహుతి - అయిపో వాల్సి వచ్చినా వెనక్కి తియ్యకూడదు.

సౌభా—నేను చెప్పలేనండీ. మీరే చెప్పండి?

ఈశ్వ—సుబ్బులూ. వేడిచల్లారిన వళ్ళుమాది; యీగ్రామ పునరుద్ధరణ నే ప్రారంభించిందికాదు. నీవుత్సాహానికి జత పరచి నేనూ వుత్తేజపడితే యీగ్రామంలో యీకాస్తపనీ చేయగలిగాం. యిప్పుడు నువ్వెళ్ళిపోతే యీవుత్సాహం చల్లారిపోతుంది. నామాటవిను సుబ్బులూ.

అమ—సరేనను సుబ్బులూ. యీశ్వరయ్యగారు అల్లా అడుగు తుంటే వూరుకుంటావేం ?

వీర—నీవోవన నువ్వెళితే యికయెవరిదోవ వారిదే, కానియ్యి. నాదోవనాది, యిక బయటకు వచ్చేవాడే వుండడు.

రావు—ఆ, అంతే, 'ఛో ఛో' అని తోలేవాడే లేకపోతే. మనహాళ్ళాపని చేసేది? లాభంలేదు.

ఈశ్వ—చూశావా సుబ్బులూ అప్పుడే అందరిలో యెంత నిరుత్సాహం మొలకెత్తిందో?

సుబ్బు—సరేలెండి ... ఆలోచిద్దాం – (లోపలికెళతారు)

వీర—అమ్మయ్య!

అమ—ఒప్పుకున్నట్లేనా ?

ఈశ్వ—నువ్వూరుకుంటావేం సౌభాగ్యా! లోపలకెళ్ళి కాస్త రహస్యంగా చెప్పు.

సౌభా—నేపడుతున్న బాధ మీకర్థం కాదులెండి.

ఈశ్వ—ఏంబాధపడుతున్నావమ్మా? నాకూ అర్థమవలేదు. చెప్తావా ?

[ నవ్వుతారు ]

అమ—మనం యింకో పనికూడా చెయ్యాలండీ, యీశ్వరం గారూ !

ఈశ్వ—ఏమిటది ?

అమ—మన "హోస్టల్, ఆస్పత్రి, స్కూలు" అన్నింటిని Photo తీయించి పేపరుకి పంపాలి.

ఈశ్వ—ఓ అలాగే పంపుదాం, ఇంతవరకూ యీపని చేసినవాళ్లు ఉత్సాహంతో మన మార్గం అవలంబిస్తారు. యిప్పటికే అనేక గ్రామాలు అభివృద్ధిపొందుతున్నాయి. వడివడిగా దేశం ముందుకు పోతోంది. దేశాభివృద్ధికి కావలసిన కృషి ప్రభుత్వం వివిధరంగాల్లో చేస్తున్నది. రెండవ ప్రణాళికలో వేలకువేల కోట్లకోల రూపాయలు ఖర్చుచేసి కులలేని పట్టుదలతో, National Laboratories నిర్మిస్తున్నది. యివి పారిశ్రామిక విజ్ఞానాభివృద్ధికి యెంతో పనిచేస్తున్నాయి. పరిశ్రమలతో, యెక్కువ వుద్యోగాలు, యెక్కువ వుద్యోగాలతో అనేక మందికి సంతృప్తి, దేశానికి అధికోత్పత్తి కలిసి వస్తాయి. మొదటి ప్రణాళికలోనే పాడిపంటలు, పంచదార, సిమెంటు వస్త్రాలు ముడియినుము మనకు కావలసినంత మనం తయారుచేసుకుంటున్నాం. రెండో ప్రణాళిక నెరవేరేసరికి అన్ని వస్తువులు, తయారుచేసుకోగలం. పరిశ్రమలకు కావలసిన విద్యుచ్ఛక్తి ప్రాజక్టులద్వారా సంపాదిస్తున్నాం. రైలు యింజన్లులాంటి పెద్ద పెద్ద మిషన్లు తయారుచేసే ఫ్యాక్టరీలు పనిచేస్తున్నాయి. రేడియో టెలిఫోను దగ్గర నించీ, విమానాలు నౌకలూ నిర్మించే కర్మాగారాలూ నిర్మిస్తున్నాం. గుండుసూదికూడా దిగుమతి చేసుకునే దేశం, చిన్నా పెద్ద భేదం లేని పరిశ్రమలెన్నో సాధిస్తోంది జపాను వరిసాగు మొదలైన ఆధునిక పద్ధతులతో కొత్త కొత్త యెరువులతో కొత్తరకపు విత్తనాలతో ఆహారపు కొరత తీరింది.

కొత్త ప్రాజెక్టుల నిర్మాణంతో మరింత దేశం సాగవుతుంది. కొత్తభూముల కమపుపండి, నవ్యభారతం, నిత్యకళ్యాణపు పచ్చతోరణాలతో నిండిపోతుంది. ఆహారపు రవాణా సౌకర్యాలు మెక్కువగా చేయిస్తున్నారు. రైలు మార్గాల అభివృద్ధితో కొత్తపెట్రోలు కర్మాగారాల సహాయంతో సరఫరా సౌకర్యాలలోటు తొలగిపోతుంది. బెంగాలు క్షామంలాంటి విపరీత పరిస్థితులు, కలలోని, కలనాటి మాటలవుతవి.

ప్రథమ ప్రణాళికతో అధికాహారాన్ని, ద్వితీయప్రణాళికతో పరిశ్రమల అభివృద్ధీ, రానున్న ప్రణాళికలతో సర్వతోముఖాభివృద్ధినీ, మన దేశం కరతలామలకం చేసుకుంటోంది. సర్వదేశ స్నేహసౌహార్దాల సంపాదిస్తూ, తాను చేయగల సాయం యితర దేశాలకు చేస్తూ, యితర దేశాల్నించి కోరదగిన సహాయం కోరుతూ, దేశం ముందుకు పోతోంది.

ఇతర దేశాలకు వక్క శాంతిమార్గాలేకాక, భూదానోద్యమంద్వారా సౌమ్యమార్గాలను, యీ ప్రణాళికల ద్వారా అభ్యుదయ మార్గాలను, మన దేశం ఆదర్శంగా చూపెడుతున్నది. ఎన్నో యితర దేశాలు యీవరకే అభివృద్ధిపొందాయి. మెన్నో అస్వతంత్ర దేశాలు యింకా అసంతృప్తిలో అటమటిస్తున్నాయి.

ఎన్నో దేశాలు యిన్నాళ్లూ స్వతంత్రంగా వున్నా, ఏ అభివృద్ధీ లేకుండా వుండిపోయినాయి. స్వతంత్రం సంపా

దించిన తర్వాత పదేళ్ళన్నా కాకపోయినా మనదేశం ఎంతో అభివృద్ధిని యిప్పటికే పొందింది.

ప్రతిగ్రామం అభివృద్ధి పొందాలన్న ఆందోళనతో ప్రభుత్వం మనకు యీకమ్యూనిటీ ప్రాజెక్టులూ N. E. S. Blocks యేర్పరిచింది. యేగ్రామాని క్కావల్సిన సదుపాయాలు ఆ గ్రామమే చేసుకోటానికి యిది చక్కని గ్రామం.

రోడ్లు, స్కూళ్ళు, ఆస్పత్రులు యెన్ని కట్టుకున్నా మనకి ప్రభుత్వం ధనసహాయం చేస్తుంది, పైలెట్ స్కీము ద్వారా పెట్టుబడులు పెడ్తుంది. దేశం చూపిన యీసదుపాయాలను సద్వినియోగం చేసుకోవడం మన విధి, దేశంతో మనమూ పదం కలిపి ప్రయాణం చెయ్యాలి. ఇప్పుడు మనం చేసిన ప్రతిపనీ భావిభారతచరిత్రలో వొక సువర్ణాక్షరంగా లిఖింపబడ్తుంది.

[ఒక సర్వే యింజనియరుగారు ప్రవేశిస్తారు అందరూ అటు చూస్తారు.]

ఇంజి—ఔను. భావి భారత ప్రజలు తరతరాలుగా మీ అందర్నీ తమ దివ్యస్మృతిలో నిలుపుకుంటారు. కాని యింతటితో మీరు ఆగిపోకూడదు. గ్రామం కంటె యెక్కువగా దేశంకోసం పాటుపడాలి. (అంతులేని ఆత్మవిశ్వాసంతో, పొంగులెత్తే దేశాభిమానంతో వుప్పొంగిపోయే వుత్సాహంతో వురకలేస్తూ ముందుకు పదండి)

ఈశ్వ—ఎవరు బాబూ మీరు?

ఇంజ—ఒక సర్వే ఇంజనీయరును. కృష్ణమీద కట్టబోతున్న ప్రాజెక్టుకు సర్వే చేయుటకు నన్ను వేశారు. సర్వే చేస్తూ మీ గ్రామం చూచాను. చాలా సంతోషించాను. మీ అందరికీ నా అభివందనాలు.

ఈశ్వ—ప్రజలు పూనుకుని, అధికార్లు సహకరిస్తే దేశం సాధించలేనిది యేమిటి?

ఇంజ—ఇక్కడి కారుమైళ్ళ దూరాన, కృష్ణమీద వకకొత్త ప్రాజెక్టు కడుతున్నారు. ఆ ప్రాజెక్టు ఆంధ్రదేశపు పంటల్ని రెండింతలు యెక్కువ చేస్తుంది యిప్పుడు బీడుగావున్న భూమిలో బంగారం పండుతుంది.

ఆమ—అయితే మన భూమంతా బంగారంగా మారిపోతుందన్నమాట

రావు—లెక్కేమిటి? బస్తా పండేచోట పాతికబస్తాలు పండుతుంది.

ఇంజ—కృష్ణానదీప్రవాహాన్నాపి, వక సరస్సు చేస్తారు! ఆ సరస్సు కొన్ని చదరపు మైళ్ళ నాక్రమిస్తుంది షుమారు పాతిక గ్రామాలు ఆ సరస్సులో మునిగిపోతాయి

రావు—పాతిక గ్రామాలే!

ఇంజ—ఆ. పాతిక గ్రామాలు. ఆ పాతిక గ్రామాల్లో వొకటి మీ గ్రామం.

అందరూ—ఆఁ!

ఇంజ—ఆ, మీ గ్రామం, మీగ్రామానికి పైయెత్తున మరో పది గ్రామాలు కూడా.

వీర—మా గ్రామమా! మా గ్రామమా!

ఇంజ——ఆ. దేశసౌభాగ్యం కోసం దేశంలో కరువులు కరవై పోవటంకోసం. మీ గ్రామం మునిగిపోక తప్పదు.

సౌభా——ప్రాజెక్టులు కావాలంటే యిటువంటి యిబ్బందులు రానిచోట కట్టుకోవాలిగాని గ్రామాలు మునిగేటట్టా?

ఇంజ——సాధ్యమైనంతవరకు అలాగే చూస్తాం. కాని వొక్కొక్కప్పుడు తప్పదు.

అమ——అయితే వున్నవన్నీ వొదలుకొని పొట్టచేతపట్టుకొని పోవాలన్నమాట?

ఇంజ——అక్కర లేదు, మీయిళ్ళకూ, ఆస్థికీ, విలువకట్టి ముదరా యిస్తారు.

రావు——కాని యీ శరీర కష్టానికి మూల్యము కట్టి యివ్వగలరా! చిన్ననక పెద్దనకా నడుంకట్టి పనిచేసి వ్యాగిని యీ మాత్రం బాగు చేసుకున్నాం.

అమ——నా తాత ముత్తాతలు యిక్కడ పుట్టి పెరిగారు. మా నాయన యిక్కడ పుట్టి పెరిగాడు, యీ భూమిని బంగారంచేసి మాకిచ్చిపోయారు. యీ భూమికి విలువ అంటూ వుందా?

ఇంజ——కాని యిదీ ఆలోచించండి. యీ నేలయినా వేరే నేలయినా అంతా మన భారత దేశమేగా; మీ కిక్కడ తిండి కరువులేదు, పండిన పంట మీకు సరిపోతుంది. కనక ప్రాజెక్టు ప్రాముఖ్యం మీకు తెలియటంలేదు. కాని యెంతమందో ప్రజలు వాళ్ళ భూములు సాగుచేసుకోటం కోసం వాళ్ళపిల్లల భవిష్యత్తుకోసం, వాళ్ళ తిండి కోసం ఘొలుగెత్తి ఆక్రోశిస్తున్నారు. మీరు త్యాగం చేస్తే

వాళ్ళ కష్టఫులు నిండుతవి? బోలెడంత భూమి వృధాగా, పండక, పొట్టచేతపట్టుకుని పరాయి వూళ్ళకుపోయి పొట్లు పడ్తున్న సోదర భారతీయుల తరఫున మిమ్మల్ని ప్రార్థిస్తు న్నాను. మీ గడపదగ్గర నుంచొని అన్నమో రామ చంద్రా అని ఆక్రోశిస్తున్న వారి గిన్నెలో మన్నుపోస్తారా?

రావు—ఈశ్వరయ్యగారూ మాట్లాడరేం? వారంటున్నదీ వినబడటంలే?

ఈశ్వ—వినబడుతోంది, వినబడుతున్నది. గుండె చెరువై పోతున్నది. అమరయ్యా యేమంటావు?

వీర—వేరే అనేదేముంది? వీల్లేదని చెప్పేయ్యండి.

ఈశ్వ—అమ్మాయీ సౌభాగ్యా! దగ్గరకురా. యేం చెప్ప మంటావమ్మా

సౌభా—నేనేం చెప్పగలను యిది మీ గ్రామం.

ఈశ్వ—సుబ్బులూ!

సుబ్బు—చెప్పండి. చెప్పండి. అలాగే వూరు వదలి వెళతా మని చెప్పండి.

రామ—ఆ.

అమ—మనవూరు మనం వదలి వెళ్ళటమా వీల్లేదు. యిక్కడ పుట్టిన కట్టె యిక్కడే మట్టి కావాల్సిందే.

సుబ్బు—నేనూ యిక్కడే పుట్టాను.

రావు—ఇంత కష్టపడి వూరిని కట్టుకున్నాం!

సుబ్బు—నేనూ వూరిని కట్టాను.

అమ—మరి నువ్వూ అట్లా అంటావేం? నువ్వూ, యీశ్వ రంగారు నిద్రపోతూన్న వూరిని మేల్కొలిపారు, మీరే

గ్రామాన్ని నీటిలో కలిపెయ్య మంటారా? నిప్పులో పారెయ్య మంటారా!

సుబ్బ—ఇది నీటిలో కలపటం కాదు. ఇది నీటిలోకలపటం కాదు. గ్రామాన్ని మనమెట్లా బాగుచేసుకున్నామో అట్లాగే దేశాన్ని బాగుచేసుకోవాలి దేశం కోసం మనం త్యాగం చెయ్యాలి. యింతవరకూ, దేశం స్వాతంత్ర్యం కోసం కొందరు ప్రముఖుల ప్రాణాలను కోరింది. ఇప్పుడు దేశం సౌభాగ్యం కోసం మన గ్రామన్నే కోరింది. ఇది వరకు అసువులు ధారపోసి అనేకమంది మన కాదర్శ మయ్యారు. గ్రామాన్నే దేశాని కర్పించి, మనమూ ఆదర్శమార్గాన్ని అనుసరిద్దాం.

అమ—సుబ్బులూ!

సుబ్బ—ఇది మన గ్రామం. అది మన దేశం. గ్రామాన్ని విడిచి దేశం యెట్లా లేదో దేశాన్ని విడచి గ్రామం అట్లా లేదు; ఎంతమంది అభివృద్ధి లేదన్నా యెంతమంది యిది మార్గం కాదన్నా, దేశం ప్రతి క్షణం ముందడుగు వేస్తోంది. అడుగులో అడుగు కలిపి మనమూ ముందుకు పోదాం పదండి.

ఈశ్వ—సుబ్బులూ ఆగు; సౌభాగ్యా యిట్లారా? నువ్వు మనస్సులో పడినబాధ నే నిప్పు డనుభవిస్తున్నానమ్మా! మనసులో పుట్టిన కోరికను బయటకు నెట్టటం యెంత కష్టమో నా కిప్పుడర్థమయింది తల్లీ! యిన్నాళ్ళూ యీ గ్రామాన్ని గూర్చి కలలు కన్నాను. యిన్నాళ్ళూ యీ గ్రామాన్ని గూర్చి యెన్నెన్నో మమతల్ని పెంచు

కున్నాను. ఒక్క సారిగా మనసు మార్చుకుని మమతల్ని చంపుకుని మరో గ్రామానికి వెళ్ళటం యెంత బాధో యిప్పుడు తెల్సింది. తెలియక తప్పు చేశాను. నన్ను క్షమించుతల్లీ...పదండి ఫ్యాదు విడిచి వెళ్ళి వేరే ఫ్యాదు కట్టుకుందాం.

వీర—సరే పదండి.

ఈశ్వ—సుబ్బులూ యిట్లా రా! నువ్విప్పుడొక్క పని చెయ్యాలి.

సుబ్బు—దేశం కోసం యేం చెయ్యమన్నా చేస్తాను.

ఈశ్వ—దేశం కోసం అనుకో, వూరికోసం అనుకో. సౌభాగ్యను నువ్విప్పుడు పెళ్ళి చేసుకోవాలి?

సుబ్బు—పెళ్ళా! యిప్పుడా?

ఈశ్వ—ఇప్పుడే ఏం? ముహూర్తం బాగులేదా?

సుబ్బు—అహా, అది కాదు; ముందుపని చాలా వుంది; తిరిగి వూరిని కట్టుకోవాల్సివుంది. యిప్పుడు పెళ్ళిళ్ళు పేరంటాలు పెట్టుకు కూర్చుంటే యెల్లా?

ఈశ్వ—వాటన్నిటికోసం దీన్ని ఆపితే— దీనికోసం దాన్నీ, దానికోసం దీన్నీ, మరచిపోతాం.

సుబ్బు—క్షమించండి. అటువంటి పొరపాటు చేయకుండా వుంటాను.

ఈశ్వ—కాని మాకు నమ్మకం లేదు.

సుబ్బు—నన్ను నమ్మరా?

ఈశ్వ—అహా, నమ్మను. నేనే కాదు, వూళ్ళో వారెవ్వరూ నమ్మరు. యేమయ్యా నమ్ముతారా?

అంద—నమ్మం. నమ్మం.

సుబ్బు—కాని...కాని...సౌభాగ్య

ఈశ్వ—సౌభాగ్యకూడా నమ్మదు.

సుబ్బు—కాని దేశంకోసం ... ... ...

ఇంజ—దేశంకోసమే యీ పెళ్ళి. పెళ్ళి చేసుకుని దంపతు లిద్దరూ చిరకాలం దేశసేవ చేయండి.

ఈశ్వ—దేశసేవ దాంపత్యం రెండూ శుభకార్యాలే. యీ పాత వూళ్ళో పెళ్ళి, కొత్త వూళ్ళో గృహప్రవేశం. యేమయ్యా యేమంటారు ?

అంతా—అంతే...అంతే...

సుబ్బు—కాని ... ... కాని ...

ఈశ్వ—కానీ లేదు గీనీ లేదు. సౌభాగ్యతోపాటు వూరి సౌభాగ్యం కోసం కృషిచెయ్యి. వూరి సౌభాగ్యమే నీ సౌభాగ్యం. నీ వూరి సౌభాగ్యమే నీ దేశ సౌభాగ్యం. పదండందరూ; యీశుభముహూర్తానే పెళ్ళి.

సుబ్బు—ఇప్పుడేనా ?

రావు—ఇప్పుడేనా ?

వీర—ఆ, ఇప్పుడే. పదండందరూ.

అమ—పదండందరూ- పందిరి వేద్దాం.

అందరూ—పదండందరం పెళ్ళికి వెళదాం.